శ్రీ

# రామదాసు నాటకము

రావుసాహేబు, డి. వేంకటరమణయ్య, బి.ఏ. గారిచే

విరచితము

రెండవ కూర్పు



చెన్నపురి

"డైయొసీజన్" ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె

1927

 [వెల, రూ. 1-0-0.

# ప్రకటన

ఈ రామదాసు నాటకమునకుఁ గల సర్వస్వాతంత్ర్యములు గ్రంథకర్తకుఁ జెందియున్నవి. కావున దీనిని భాషాంతరీకరణ మొనర్ప వలయునన్నను లేక ఖేలన మొనర్పవలయునన్నను లిఖితరూపముగా వారి యనుమతిని ముందుగనే పొందవలయును.



# PREFACE

The story of 'Ramadas', the great devotee of God Rama, is very popular in this Presidency, especially in the Andhra Desa. The date of the story is (circa) A.D. 1685. Gopanna, popularly known as 'Ramadas', and the nephew of the Golkonda ministers, Akkanna and Madanna, seems to have been put to extreme torture by Abdul Hassan, the last of the kings of Golkonda, on account of some alleged misappropriation of money by him. The story deals as to how Ramadas came to spend Sircar money for building the temple at Bhadrachalam dedicated to Sri Rama and his imprisonment therefor by the King (familiarly styled Tanisha), how God Rama himself paid the amount to Tanisha on behalf of his Bhaktha, and how Tanisha subsequently coming to know all this craved pardon of Ramadas for the cruelties inflicted on him, and as an atonement gifted away Bhadrachalam as a jaghir for the service of Rama at the temple.

It seems pretty certain that the episode has a historical basis. For even now His Exalted Highness the Nizam of Hyderabad makes an annual grant to the temple at Bhadrachalam and the place where Ramadas was imprisoned is still existent.

2. In working out the plot, I have largely followed the orthodox version of the story, as narrated in the old printed works on the subject and incorporated in the drama some of the popular songs and verses found therein as being of particular interest. The introduction of the characters of Rama Sastri and of his wife Viramma into the drama is my own and has been well received by the public A close study of their characters will, I am sure, be interesting and instructive.

3. The drama was thrice enacted by the Madras Suguna Vilasa Sabha in the course of a year and the favourable reception given to it has prompted me to print the work. There will no doubt be found sins of omission and commission in the book as it is the first work of the author, and I shall, therefore, be happy to receive suggestions to improve the work. For the convenience of readers I have added a short abstract of the several scenes in the drama.

4. My best and sincere thanks for helping me in the work are due to my good friend and well-wisher, Mr. Vedurumudi Seshagiri Rao. I must also not fail to thank my friends Mr. P. V. Rajamannar Naidu, B.A., Mr. E. Bhashyam Iyengar, Mr. V. Venkateswara Sastrulu, and Mr. V. Venkatachalla Iyer for the suggestions they have given me, the last-named gentleman especially for seeing the work through the press.

28 KARANESWARAR
KOIL STREET
*Saidapet, Madras.*

D. V.

## PREFACE TO SECOND EDITION

In bringing out a Second Edition of the book, I have made the drama more adaptable for the stage. The songs are now printed in the end of the book as an appendix and I have put in more verses in the text in the place of some of the songs. Actors can now use the verses or songs at their option. I hope those interested in drama will welcome the changes and extend their patronage for the work.

My thanks are due to Mr. Bukkapatnam Ramanujiah for seeing the work through the press.

I have again to reiterate that societies acting the drama whether in whole or part should obtain my previous permission in writing.

MAMBALAM,
*Saidapet, September 1927.*

D. V.

# కథాసంగ్రహము.

## ప్రథమాంకము

రంగము—1. గోపన్నయును మిత్రులును భజనచేయుట. గురువుకొఱకు గోపన్న ప్రార్థించుట. కబీరుదాసు రాక. తారకమంత్రోపదేశము.

రంగము 2. గోపన్నమిత్రులలో నొకఁడగురామశాస్త్రి భార్య వీరమ్మ, తనభర్త గోపన్నతోఁ గూడి భజనలలో ప్రొద్దుగడపుచు గృహకృత్యములు చూచుటలేదని, భర్తను తప్పులెన్నుట.

## ద్వితీయాంకము

రంగము—1. గోపన్న మేనమామలును, గోలకొండ (ఔరంగబాదు) నవాబు తానీషాయొద్ద ముఖ్యమంత్రులును నగు, అక్కన్న మాదన్నగార్లు, తానీషాతో చెప్పి, గోపన్నకు భద్రాచలం తహశీల్దార్ పని యిప్పించుట.

రంగము—2. ఆకస్మికమరణమునకు పాలైన గోపన్న సుతుఁడు, రాముని కటాక్షమున బ్రతుకుట. బ్రాహ్మణులు గోపన్నకు "రామదాస"ను బిరుదము నిచ్చుట.

## తృతీయాంకము.

రంగము 1. భార్య ప్రోత్సాహమువలన, రామశాస్త్రి భద్రాచలమునకు పోయి, గోపన్న సహాయమున తానుగూడ తహశీల్దారు పదవిని పడయ నిశ్చయించుట.

రంగము—2. శ్రీరాములకుఁగాను గొప్పదేవళమును నిర్మించుటకు, రామదాసు నిశ్చయించుట.

రంగము—3. తన్నిమిత్తమునకై భద్రాచలపురజనులతో యోజనసలుపుట.

రంగము—4. క్రమమున తహశీల్దారీని పడయఁగోరి, ముందు రామశాస్త్రి, రామదాసునొద్ద తాబేదారుగా చేరుట.

## చతుర్థాంకము.

రంగము—1. రామదాసును పనినుండి తొలఁగించుటకు రామశాస్త్రి, గోలకొండలోని మహమ్మదీయమంత్రులతో కుట్రపన్నుట.

రంగము—2. భద్రాచలమున దేవాలయమును కట్టించుటకు, రామదాసు సర్కారుపైకము ఆఱులక్షల రూప్యములను వ్యయపఱచె నని తానీషాగారితురక మంత్రులు, రామదాసుపై ఫిర్యాదుచేయుట. తానీషా రామదాసును బందిచేసి తెమ్మని హర్కారులను బంపుట.

రంగము—3. రామదాసును తానీషాజవానులు బందిచేసి కొనిపోవుట.

## పంచమాంకము.

రంగము—1. తానీషా రామదాసును విచారించి బందిగావించి యాతనికిబదులు రామశాస్త్రిని భద్రాచలము తహశీల్దారుగా నియమించుట

రంగము—2. తహశీల్దారుభార్య యగు వీరమ్మ తన యధికారమును చూపుట.

రంగము—3. రామదాసు కారాగృహమున కష్టము లనుభవించుట.

రంగము—4. రామదాసును కాపాడుమని సీతాదేవి శ్రీరామచంద్రుని వేఁడుకొనుట.

## షష్ఠాంకము.

రంగము—1. తానీషా స్వప్నము. రామలక్ష్మణులు నౌకరులవలె వచ్చి సొమ్ము చెల్లించి, తానీషాయొద్ద రసీదును గొనిపోవుట. రామదాసును చూచుటకు తానీషా చెఱసాలకు పోవ తీర్మానించుట.

రంగము—2. రామదాసునకు కారాగృహ విమోచనము. తానీషా పశ్చాత్తప్తుఁడై, రామదాసుతోఁ గూడ భద్రాచలమున కేగి, రామలక్ష్మణులఁ జూపుమని కోరుట.

## సప్తమాంకము

రంగము—1. రామశాస్త్రి, తహశీల్దారీపదవినుండి, తొలఁగింపఁబడి, పశ్చాత్తప్తుఁ డగుట.

రంగము—2. తానీషా భద్రాచలపు దేవళమునందు రామలక్ష్మణులను దర్శించుట.

మంగళము

## నాటకమునందలి ముఖ్యపాత్రలు

### పురుషులు.

గోపన్న [రామదాసు]—కథానాయకుఁడు.

కబీరుదాసు—గోపన్న గురువు [రామభక్తుఁడు.]

తానీషా—గోలకొండ ప్రభువు.

| | |
|---|---|
| అక్కన్న<br>మాదన్న | తానీషా ముఖ్యమంత్రులు. |

రామశాస్త్రి—గోపన్న మిత్రుఁడు [నెలకొండపల్లె కాఁపురస్తుఁడు.]

రామమూర్తి—గోపన్న పుత్రుఁడు.

రామారావు—భద్రాచలము శిరస్థాదారుఁడు.

| | |
|---|---|
| నాజర్‌జంగ్<br>జాఫర్‌జంగ్ | మహమ్మదీయవజీర్లు. |

| | |
|---|---|
| రహీం<br>ఉస్మాన్ | చెఱసాల తురకజవానులు. |

శ్రీరాములు—విష్ణుని అవతారము.

లక్ష్మణుఁడు—రామానుజుఁడు.

నెలకొండపల్లె భజనసంఘమువారు; భద్రాచలమునందలి బ్రాహ్మణులు, భటులు మొదలగువారు.

### స్త్రీలు.

భ్రమరాంబ—గోపన్న భార్య.

వీరమ్మ—రామశాస్త్రిభార్య.

సీతమ్మ—శ్రీరాములదేవి.

| | |
|---|---|
| గురుషిద్ బేగం<br>కృపాబాయ్<br>రోషనార బేగం | తానీషాభార్యలు. |

# ఈశ్వర ప్రార్థన



ఉ॥ ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁ దాన యైనవాఁ
డెవ్వఁడు, వాని నాత్మభవు నీశ్వరు, నే శరణంబు వేఁడెదన్.

క॥ విశ్వకరు విశ్వదూరుని, విశ్వాత్మకు విశ్వవేద్యు-విశ్వు నవిశ్వున్,
శాశ్వతు నజు బ్రహ్మప్రభు, నీశ్వరునిం బరమపురుషు-నే భజియిం
[తున్.



శ్రీ

# రామదాసు నాటకము.

## మొదటి అంకము - మొదటి రంగము.

కొండపల్లె - భజనమండపము. గోపన్న, అతని స్నేహితులు రంగయ్య, రామశాస్త్రి, నరసింహము, వీరన్న, వేంకటేశము మొదలగు వారు భజనచేయుచుందురు.

### అనుబంధము 1.

[భజన ముగియఁగనే]

**గోపన్న**—అన్నలారా! నేఁడు సుదినము. మన జీవితములందు నీక్షణ కాలము, మహాపర్వకాలము. చతుర్దశభువన నిర్మాణ సంరక్షణ వినాశన కేళీపరతంత్రుఁడగు, శ్రీ నారాయణుని కరుణా కటాక్ష వీక్షణ ప్రసారము మనలఁ బ్రేరేపింపకున్నచో, ఆ మహనీయుని దివ్యతమమధుర నామామృతపానమును, మనము సలుపుట చేకూరదు. నేఁడట్టి మహాభాగ్యమును కలుగఁజేసినందులకు, ఆ భక్తవత్సలునకు, సాష్టాంగ ప్రణామ సహస్రంబుల మన మాచరింతము. సోదరులారా! ఆ క్షణ కాలము, మన చిత్తము లన్యథ్యసములుగాకుండ, ఏకాగ్రతతో, లోకాతీతుని స్మరించుటవలన కలిగిన అనిర్వాచ్యానందమును మీరందఱును అనుభవించితిరి గదా? ఐహిక సౌఖ్యములందేదియైన నిట్టి యానందమును మన కొసంగఁజాలునా?

**రంగయ్య**—గోపన్నగారు! ఇట్టి యానందమును, మే మెన్నఁడును పొంది యెఱుఁగము. భక్తాగ్రగణ్యులరగు మీ సహవాస విశేషంబున, ఇట్టి భాగ్యమును మేము వడయఁగలిగితిమి.

**రామశాస్త్రి**—నిజము నిజము. ఇట్టి సౌఖ్యమును, మే మిదివఱ కెన్నఁడును అనుభవించియుండలేదు,

**గోపన్న**—మహనీయులారా! ఇదియంతయు నా శ్రీరాముని కటాక్షము. ఇట్లు అహర్నిశములు, నిశ్చలభావముతో, జగదీశ్వరుని సేవఁజేసినందునఁ గలుగు మహానందము ననుభవించు వారే మహర్షులు, ఏకాంతభక్తులు.

**అందఱు**—అది యెట్లు సిద్ధించును?

**గోపన్న**—అది యాపరమపురుషుని నిర్హేతుకజాయమాన కటాక్షము వలన సిద్ధింపవలెను, కాని:—

ఉ॥ శ్రీపతి సన్నిధానమును జేరఁగఁ గోరిన, భక్తిమార్గమే
ప్రాపగు నెల్లజీవులకు, భస్మమొనర్చును బాపసంతతిన్,
శ్రీపతిభక్తుఁడౌ గురునిసేవ లభించిన, సాధుజన్మ మా,
నాపదలెల్లఁ బాయుఁ దుది నవ్యయసౌఖ్యము వే లభించెడున్.

**ఆహా!** అట్టి భాగ్యము, ఈ దీనున కెన్నఁడైన లభించునా? జనన మరణ విరహిత శాశ్వతమోక్షపదవీ సంధాయకుఁడగు సీతామనోనాయకుని, దివ్యవదనారవింద సందర్శనభాగ్యమును గలిగింపఁ జాలు మారుతసూనునివంటి రామభక్తాగ్రగణ్యుఁడగు గురుపుంగవుఁడు నాకెన్నఁడు లభించునో, నేనెప్పుడు తరింతునో? అట్టి పరమగురుని పాదారవింద సంస్పర్శనమున పాపభూయిష్ఠమగు నీ కళేబర మెత్తతి నైనఁ బవిత్రమగునా? శ్రీరామచంద్రా! దీనజనచింతామణీ! ఆర్తత్రాణపరాయణా! శరణాగతవత్సలా! నాపై నీకేల దయగలుగదు, తండ్రీ! [ధ్యానించును.]

[కబీరుదాసు పాడుచు ప్రవేశించును]

అనుబంధము 2.

**గోపన్న**—[తనలో] ధన్యోస్మి, ధన్యోస్మి. ఈతఁడు నన్నుద్ధరింప నేతెంచిన మహనీయునివలె గోచరించుచున్నాఁడు. ఆహా! ఏమి రాముని మహిమ! తలంచినంతనే తామరసదళాక్షధ్యాన పరతంత్రుఁడగునట్టి భాగవతశిఖామణి దివ్యపాదసందర్శనము నాకు లభించినది. [ప్రకాశముగా, కబీరు నెదుర్కొని]

మహానుభావా! ఈ దీనుని ప్రణామము గైకొనఁ బ్రార్థించు చున్నాను [నమస్కరించును].

కబీరు-సీతారామచంద్ర పాదారవింద సందర్శనప్రాప్తి రస్తు.

గోపన్న—అమృతరసప్రవాహము వెల్లివిరిసినది. పాపపటలములు పటాపంచలైనవి. నా జన్మము సాఫల్యమందినది.

వేంకటేశము-ఇది యేమి విపరీతపుఁజర్యగా నున్నది. గోపన్నగారి భక్తి వెఱ్ఱితలలు వేయుచున్నది!

నరసింహము—ఈ వచ్చినయాతఁ డెవ్వఁడో? వేషము తురుష్క వేషము, భాష హిందువులభాష, రసన రామనామామృతము గురియుచున్నయది.

రామశాస్త్రి—గోపన్నగారు నిందాపాత్రులు గారు. ఆయన నిశ్చల భక్తుఁడు. రామనామస్మరణ మొనరించుచు, రామభక్తిని స్థిర ముగ నుపదేశింపఁగల గురునికొఱకు నిరీక్షించుచున్నచో, శ్రీరామచంద్రుని కటాక్షముననో, ఆకస్మికముగనో, రామ నామసంకీర్తనము చేయుచు, ఇతఁ డిచ్చటికి విచ్చేయుటచే, మన గోపన్నగారు సాష్టాంగప్రణామము గావించిరి.

వేంక-అదియే అవివేకము. ఇతఁడు తప్పక మ్లేచ్ఛుఁడనియుఁ దోఁచు చున్నది. స్వజాతిధర్మమును పరిత్యజించినవాఁడు. బహిష్క రింపఁబడఁదగును. కావునఁ దురుష్కులెవ్వరు నీతని గౌరవిం పరు. ఇతఁడు తననోట రామనామ ముచ్చరించినమాత్ర మున, హిందువులు నితని సాంఘికునిగా నంగీకరింపరు. ఇతఁ డుభయభ్రష్టుఁడు. ఇట్టివానికా బ్రాహ్మణోత్తముఁడగు గోపన్నగారు నమస్కరించుట.

నర.—గోపన్నగారు నమస్కరింపనిమ్ము, మాననిమ్ము, ప్రస్తుత విషయ మది గాదు. పరమపవిత్రమగు నీ పూజాగృహమునకు, ఈ తురుష్కుఁడు వచ్చుటచే, అపవిత్రత గలిగినది. ఇపుడు మన మందఱమును సచేలస్నానము నాచరింపవలయును. గోపన్న

ముతో దీనినంతయు శుద్ధిచేసి, సంప్రోక్షణ మొనరింపవల యును. ఇది యన్యాయము.

వీరన్న—ఏమి, గోపన్నగారు! మీరు రామభక్తులు, పూజ్యులు అని తలంచియుండఁగా, మాకందఱకును తగని యవమానము తెచ్చిపెట్టితిరి. మీరెక్కడ, ఆ తురుష్కుఁడెక్కడ? స్మృతి తెలియకయో, పరిహాసమునకో, కపటవృత్తిని మనల వంచించి ధనమును గడించుటకో, ఆతఁడేదో వెఱ్ఱిమొఱ్ఱి రామ కీర్తనము పాడినంతమాత్రమున, మీ రిట్లు సాష్టాంగప్రణామము చేయవచ్చునా? దీనిని చూచి మే మెట్లు సహింపఁ గలము?

గోపన్న—[తనలో] ఏమి వీరి యజ్ఞానము! [ప్రకాశముగా] సోదరులారా! నన్ను క్షమింపుఁడు. ఈ మహాభక్తుఁడు, దివ్యతేజో విలాసభాసురవదనారవిందుఁడై, సహస్రరవిప్రభాభాసమానుఁడై, దురాలోక్యుఁడుగానుండ, ఆతని మహిమను మీరించుకయైనను గ్రహింపఁజాలకపోయితిరి గదా? [తనలో] రామచంద్రా! ఈ నా సోదరులపైఁగూడ నీ కటాక్షము నించుకేని ప్రసరింపఁజేయవైతివేల తండ్రీ? [ప్రకాశముగా].

చ॥ ఇతఁడు ధరామరుండు, మఱి యీతఁడు మ్లేచ్ఛుఁడటన్న భేద
మతిపొరపాటుచేతనె; రమాపతిభక్తియె, జీవకోటిస [ముల్
ద్గతికిఁ బ్రధానమార్గము జగంబునఁ గావున నిష్ఠనైన మూ
ర్ఖత విడనాడి సత్యము పరంబని యెన్నుఁడు మోక్షగాములై.

అన్నలారా! అగ్రవర్ణము, అంత్యవర్ణము నను నిరర్థకవివాదము మాత్రమే మీరు పాటించుచున్నారుగాని, పతితపావనుని భక్తాగ్రగణ్యుఁ డేకులమువాఁడైనను, సర్వజనపూజ్యుఁడు అను సాధువాక్యము నాలోచింపరైతిరి కదా? నాయనలారా! ఇది యజ్ఞానము కదా? పాపహేతువు కదా? సర్వేశ్వరుఁడు సర్వాంతర్యామి యని శ్రుతులు ఘోషించుచుండ, ఆతఁడు లేనిమూర్తి యాతని సృష్టియం దన్యము ఎట్లుండఁగల్గును? ఇట్టి భ్రమ మనకుఁ దగదు:—

సీ॥ తనవాగమృతముచే నినకులాధిపుఁ బూజ
గొనిన వాల్మీకి యే కులమువాఁడు?
భారతామ్నాయవైభవముచే రాజిల్లు
వ్యాసమానిని గన్న వనిత యెవతె?
మునిలోకపూజ్యుఁడై తనరు వసిష్ఠుండు
జననమొందిన దెట్టి ఘనకులంబు?
అపరవిధాత నా నలరు గాధిసుతుండు
భూదేవకులమునఁ బుట్టినాఁడె?
అమరసములైన పన్నిద్దఱాళువారు
లగ్రకులసంభవులె పూజ లందలేదె?
దేవదేవునిభక్తులే దేవసములు
వారలకు జాతిమతముల వాదు లేల?

కబీరు—మహాత్మా! నీమహిమ నీ వెఱుఁగఁజాలకున్నావు. అభినవవికసిత వల్లరివలె నీ వుండుటచే, నీ దివ్య సుగుణకుట్మలము, ఇంకను చక్కఁగ వికసించి, విశ్వజనానందకరముగా సౌరభమును వెదఁజల్లుట లేదుగాని, నన్నుఁగన్నతండ్రి యగు, శ్రీరాముని కటాక్షమున, ఆ దేవదేవుని ప్రేమామృతము నత్యధికముగ నీవు చూఱగొనఁగలవని, నేను గ్రహింపఁగలిగియుండుటచే, నీ సందర్శన మహాభాగ్యము వడయుటకు నిన్ను వెదకికొనుచు నిటు వచ్చితిని. తండ్రీ! నీవు రామభక్తాగ్రగణ్యుఁడవు కాఁగలవు. అయ్యలారా! మీ రితనిహితోపదేశము నాలించితిరి గదా? నన్నించుక మున్నింపుఁడు. "నీవు మ్లేచ్ఛుఁడవు, మేము విప్రుల"మని మీరు నన్నుఁగూర్చి ముచ్చటించితిరి. ఇందు "నేను," "మీరు" అను పదములను దేని కన్వయింపఁదలఁచితిరో చెప్పఁగలరా? శరీరమునకా? శరీరము నశించునదియే. జీవునకా? జీవుఁడు నామరూపవిరహితుఁడు; భగవదంశసంభూతుఁడని మీ రెఱుఁగరా? అట్టిచో, మీరు పలికినపలుకులు నిరర్థకములే కావా? మీలోన, నాలోన,

వెలుఁగువాఁడు ఆ జగదీశ్వరుఁ డొక్కఁడేకాక యితర మేమి గలదు? ఇది యంతయు నజ్ఞానము. జాతి మత భేదమును, స్త్రీ పురుష వివక్షయును, పామరజనులు పాటింపఁదగినవి గాని, భక్తులు పాటింపఁదగినవి గావు. భక్తుని దృష్టికి ప్రపంచమున, రామమేయము గానిది యేది గలదు? మీరు నన్ను మ్లేచ్ఛుఁ డని నిందించితిరని నేను చింతించుటలేదు. మీరింకను ఆ సర్వేశ్వరునికృపకు పాత్రులు గాకపోతిరి గదా, మీకింకను విజ్ఞానము గలుగదాయెఁ గదా యని మాత్రము, నే నత్యధికముగఁ జింతిల్లుచున్నాను. అన్నలారా! ఇంకొకసారి మిమ్ము వేఁడుకొందును. నన్ను మన్నింపుఁడు. కలియుగమున మోక్ష ప్రాప్తికి భక్తియే తప్ప, మనకు శరణ్య మింకేదియు లేదని, నేను ముమ్మాటికి నొక్కి వక్కాణింతును.—

ఉ॥ పారములేని సంసృతివిపజ్జలధిం బడి పాపకర్ములౌ
వారికి భక్తిమార్గ మనివారితసద్గురుసేవ తప్పినన్
శ్రీరఘురామపాదసరసీరుహదర్శనభాగ్యలక్ష్మి చే
కూరి సుఖంబునందుటకుఁ గొండొకమార్గము లేదు, లేదిలన్.

గోపన్న—ఆహా! వింటిరా? మహనీయునివాక్యములు సుధామధుర వచనములు, విజ్ఞానామృతవాహినులు. ఆహా! దివ్యతేజోధనుఁడు, మహాశాంతమూర్తి, వైరాగ్యధనుఁడు, మనల నుద్ధరింప, మనల రక్షింప, మనలఁ దరింపఁజేయ, మోక్షమార్గ మిది యని మనకు దారిఁ జూప, ఈ మహనీయుఁడు, మన పూర్వపుణ్యావిశేషమున, సీతారామచంద్రుని కటాక్షమున నేతెంచెను. ఆతని పాదాబ్జములకు నమస్కరింపుఁడు. ఆతని యాశీర్వచనములు వడయుఁడు. ఆతని యుపదేశమున ధన్యుల రగుఁడు.

అందఱు—మహాత్మా! మేము పాపులము. మానవసహజమగు నజ్ఞానము, మమ్ము వదలమిచే, మీ మహిమ నెఱుంగఁజాలక ప్రల్లదంబులఁ బలికి పాపము నొడిఁగట్టికొంటిమి. మమ్ము

ధన్యులఁజేయుము. మమ్ము రక్షింపుము. నమస్తే, నమస్తే, నమః.

**కబీరు**—శ్రీ సీతారామచంద్రభక్తి సిద్ధిరస్తు. సోదరులారా! మీరు నాకేల నమస్కరించెదరు? మీ పాపములను బాపువాఁడను నేనా? కాను, ముమ్మాటికిని గాను. మనయందఱి పాపములఁ బాపువాఁడు, మనకందఱకును మోక్షసామ్రాజ్య మొసంగు వాఁడు, మనతండ్రి, మనదైవము, మనధాత, మనగురువు, మనధనము, మన సర్వస్వమును నాతఁడే; సుగుణాభిరాముఁడు, సుందరరాముఁడు, జగదభిరాముఁడు, జానకీరాముఁడు, కల్యాణ రాముఁడు. ఆ దేవదేవుని వరనామమంత్రమును, గోపన్నకు నుపదేశించెదను. దాని నతఁడు, మీకందఱకు నుపదేశింపఁ గలఁడు. అదియే మీకు తరణోపాయము. దానినే మీరు నిరంతరము భజింపుఁడు.

[తారకమంత్రము నుపదేశించును—"శ్రీరామరామరామేతి, రమేరామే మనోరమే-సహస్రనామతత్తుల్యం, రామనామవరాననే."]

**గోపన్న**—[ఆనందముతో] ఆహా! ఏమి యీ మంత్రోపదేశప్రభావము. నా శరీరమంతయును, దివ్యామృతవర్షంబునఁ దోఁగినట్లు, నా మానసము, మానాతీతమగు మహానందమున మగ్నమైయున్నది.

ధన్యుఁడ, ధన్యుఁడ, మఱియు ధన్యుఁడను.

సీ॥ నిఖిలశిష్యాజ్ఞాన నిర్భరతమమున
కాదిత్యకోటి బాలాతపంబు
కలితభవాభీల కాంతారసీమకు
జ్వాలాభిసహిత దావానలంబు
యమదండనక్రియా సమదమేఘములకు
సంతతఘోర ఝుంఝానిలంబు
సకలభాగ్యానీక సస్యజాతములకు
ధారాసహిత నటత్ప్రావృడంబు

ఆశ్రితశ్రేణి ఘనవాంఛితార్థములకు
భూరిఫలసిద్ధమగు కల్పభూరుహంబు
నై పవిత్రమై విలసిల్లునట్టిరామ
తారకంబునఁ గడుధన్యతముఁడనైతి.

ఉ। తారకమంత్రమే దొరకె - ధన్యుఁడనైతిని, గౌతమీనదిన్
వారక మున్గి, భద్రగిరి - వాసముఁజేసిన, నందుఁ గల్గవే
ధారుణి దివ్యదేశములు - తాపహారంబగునట్టి తీర్థముల్
చేరరు భానుడింభకుని - సేవకు లింక, నభీరులై ననున్.

అనుబంధము 3.

కబీరు—వత్సా! నీ భక్తికి మెచ్చితిని. నీవు నన్నెపుడు మనమున స్మరింతువో, ఆ క్షణమ, నేను నీకు ప్రత్యక్షమగువాఁడను. నేను పోయి వచ్చెదను. మీకందఱకును శుభమగుఁగాక.

[అని పాడుచు పోవును. అందఱు నమస్కరించి వెడలుదురు.]

అనుబంధము 4.

[తెర వ్రాలును]

---

మొదటి అంకము - రెండవ రంగము.

కొండపల్లె—బ్రాహ్మణగృహము. రామశాస్త్రి, అతనిభార్య వీరమ్మ.

రామశాస్త్రి—[ఏటియందు స్నానముచేసివచ్చి, మడిబట్టలను ధరించి, జపముచేసికొని, శ్లోకము—"సంసారసాగర సముత్తరణైకమంత్రం, బ్రహ్మాదియోగి సురసేవితసిద్ధమంత్రమ్, దారిద్ర్యదుఃఖ భవరోగ వినాశమంత్రం, వందే మహాభయహరం, రఘురామమంత్రమ్" అని పఠించుచు] ఏమి? ఎక్కడనున్నావు? పలుకవేమి? ఇదిగో నేఁడు భజనకూటమున గొప్ప భజన జరగును. గోపన్నగారు గ్రామాంతరమునకు వెళ్లుదురు. త్వరగా వంటకావలెను.

పిచమ్మ—అవునవును. నాకేమి పదికాళ్లు, ఇరువది చేతులు కాని ఉన్నవా? పనికి పాటకు పలుకుటకు, ఇంట్లో ఏ వెధవముండ లైననుంటే, నేను హాయిగా కూర్చుందును. మీకేమి చెప్పుటకు? బాపనక్కల పెడదామంటే, మీ యాలస్యమునకు, ఆచారమునకుఁ బనికిరావు. అన్నిటికి నేనే చావవలె. ఇది నేనోఁచిన నోము. ఏమో, ఐనవేళ కవును. ఈభజన ఒక నాఁటిదా, ఒకనాఁటితో పొయ్యేదా? రేయుంబగళ్లు మీకు, గోపన్నగారికి నిదేపని. ఉద్యోగాలా, ఊళ్లా? ఐనదటగదా, ఇంకనేమి యెగురులు? కొండంతకాఁపురము గుప్పెట్లలోనికి వచ్చినదఁట. ఇంకేమి గోపన్నగారు? ఏర్భాయియాలనందఱని చేరఁదీసి, పెద్దలుగడించిన యాస్తియంతయుఁ జేతులార నడిపించినాఁడు మహానుభావుఁడు. మీకాయన గురువు. ఇఁక మనగతి ఏమి కానున్నదో తెలియదు.

రామశాస్త్రి—గతియా! మనగతికేమి వచ్చినది? గతియఁట? ఈ ఆఁడు పురాణములన్ని కట్టిపెట్టుము. నిజముగా గోపన్నగారివంటి వారు ఇఁక లేనేలేరు. పరమసాధువు. మహాభక్తుఁడు. ఆతని నొకమాట యంటే, మహానరకము వచ్చును. ఆయన కేమి తక్కువ? ఆయన దుర్వినియోగము చేయుచున్నాఁడా? ఎవ రట్లనినది, నోటికి బుద్ధిచెప్పువారులేక. ఆతని మేనమామలు హైదరాబాదుదివానులని యెఱుఁగుదువా? గోపన్నగారి తండ్రిగారు తహశీల్‌దారీ చేసినారు. ఈవల పితృవంశము, ఆవల మాతృవంశముకూడ హేమహేమీలుగాని, ఆలాటి యీలాటివారు గారనుకో. గతియఁట, గతి? ఇదిగో! మొన్న సీతారామసిద్ధాంతిగారు చెప్పినారు—"గోపన్నగారి జాతకము గొప్ప జాతకము, గొప్ప యధికారము, ఐశ్వర్యము కలుగు" నని. ఎందుకీమాటలు? ఆయనకు వైరాగ్య మధికముగాని, కావలయునన్న ఉద్యోగములకుఁ దక్కువా? అందుకే హైదరాబాదునకు వెళ్లవలయునని యనుకొనుచున్నారు. గతియఁట, గతి?

వీరమ్మ—గోపన్నగారి పేరెత్తుసరికి, మీకేల యిట్లు కోపము పొడుచుకొనివచ్చినది? నేనొక్కతెనే అన్నానా, ఇంకెవరుననలేదా? ఉన్నమాటయంటే ఉలుకెందుకు? లోకమంతయు ననుచున్నారు. ఆయనతాతగారు తహశీల్దారీ చేసిన నాకేమి, ఇప్పుడాయన ప్రభువుని మించిపోయిన నాకేమి, రేపటి దినము దివాంజీపనిచేసిన నాకేమిగావలెను? ఏ పుణ్యానవైన, గోపన్నగారీగ్రామము విడిచిపోయిన, ఆవేళ ఈ యూరశేషము, ఆవుపాలు పరమాన్నము వండుకొని త్రాగుతారు. సంసారము, ఇల్లు, వాకిలి, లేకుండ ఎందఱు పాడైపోవుచున్నారమ్మా ఈతని మూలమున!

రామశాస్త్రి—చాలు, చాలు; నోరుమూయుము. నీమాటలు వింటే, నాకుఁగూడ మహాపాతకమువచ్చును. నిశ్చయముగా నతనికి రేపే తహశీల్దారీ అగును చూడు. ఇదిగో, నేనిప్పుడే సుబ్బావధానులగారియింట్లో పురాణము వినివచ్చెదను. త్వరగా వంట గానిమ్ము. (పోవును.)

వీరమ్మ—ఆహా! అందు కేమితక్కువ?

(నిష్క్రమించును.)

---

## రెండవ అంకము - మొదటి రంగము.

గోలకొండ - అక్కన్న మాదన్నగార్ల మందిరములో నొక గది. ఇరువురును రాజకార్యములు మాటాడుచుందురు. తలుపునొద్ద సేవకుఁడు గాచియుండును.

**అక్కన్న**—[మాదన్న, అక్కన్నకు ఒక జాబు నందిచ్చును. అక్కన్న దానిని తిలకించుచు] ఆహా! ఏమి శ్రీవారి విద్యాభిమానము, సర్వజనసమత్వము, నిష్పాక్షికస్వభావము. ఇట్టి ప్రభువరేణ్యుని సేవచేయు భాగ్యము పురాకృతపుణ్యవిశేషమున మనకు లభించినది సుమా, మాదన్నా!

**మాదన్న**—అన్నయ్యగారూ! తాము సెలవిచ్చినది సత్యమే. శ్రీహరి కటాక్షమున, తానీషావంటి యుదార ప్రభువునకు తమవంటి మహామతులు ప్రధానమంత్రులగుటచే, స్వర్ణమునకుఁ దావి గలిగిన చందమున ప్రభుత్వము, మఱింత చక్కఁగ నెఱవేఱఁ గలదు. మఱియొక్క ముఖ్యవిషయము గలదు. దీనిని మీరు దిలకింపుఁడు. [ఇంకొక కాగితము నందిచ్చును.]

**అక్కన్న**—[చదువుకొని] ఓహో, భద్రాచలమున తహశీల్‌దారు, ఆకస్మికముగ పరలోకగతుఁడగుటచేత, తాత్కాలికముగ నా పనిని చూచుచుంటిననియు, తగుసమర్థుల నెవ్వరినైన వెంటనే నియమింపవలయుననియు, శిరస్తా తిరుమలనాయఁడు వ్రాసి యున్నాఁడు. మఱి యీ రెండవపత్రము నెలకొండపల్లె పౌరజన విజ్ఞప్తి. ఏదీ, దీనిని జదువుము. [మాదన్నయొద్ద నిచ్చును. మాదన్న చదువును.]

"మహామంత్రులగు అక్కన్నగారి దివ్యసముఖమునకు వినయపూర్వకముగా నెలకొండపల్లె పౌరజనులు చేసికొన్న విజ్ఞప్తి:—

"గోపన్నగారి తండ్రిగారగు లింగనమంత్రిగారు హుజూరువారి సంస్థానమున తహశీల్‌దారుగానుండి, ప్రభువులమన్ననకు నెట్లు పాత్రులైనదియు తమ రెఱుంగని విషయము గాదు. లింగనమంత్రిగారు మృతినొందునప్పటికి, గోపన్నగారు చాల పిన్నవయసువారుగా నుండిరి. కావున నా యుద్యోగము నింకొకరి కియ్యఁబడినది. కాని, లింగనమంత్రివఱకును తహశీల్‌పదవి, వారికుటుంబమును విడిచియుండలేదు. ఇప్పుడు గోపన్నగారు వ్యవహారదక్షులైరి. పరమపతివ్రతాశిరోమణి యగు కామమ్మగారి పుత్రరత్న మగుటచే, వీని నభివృద్ధినొందించుభారము, మాతులులగు మీ కవశ్యకర్తవ్యమైయున్నది. సన్నిహితబాంధవ్య సంబంధ మటుండ, సామర్థ్యంబునుం బట్టియు, అధికారము, వంశపారంపర్యముగ వచ్చుచుండుటం బట్టియు, ఏ తాలూకాయందైనను తహశీల్‌పదవిని, తాము

తప్పక గోపన్నగారికే యిప్పింపవలెనని, నెలకొండపల్లె తాలూకా ప్రజలు ఆబాలగోపాలము, మీా ఘనతను ప్రార్థించుచున్నారము. ఈ మహజరునందు, తాలూకాలో ప్రముఖులందఱును పదివేలమంది చేవ్రాళ్లు చేసియున్నారము. ఇంతమందిప్రజలకోరికను జెల్లించుట సత్పరిపాలనమున కవసరమని, తాము హుజూరువారికి విన్నవించి, మా యభీప్సితమును నెఱవేర్పఁగోరెదము."

ఇట్లు,
తమ విధేయులు.

**అక్కన్న**—[యోజనచేయుచు] కంచెర్ల గోపన్న, లింగనమంత్రి పుత్త్రుఁడు, కామమ్మగారి కుమారుఁడు? ఏమి! మన కామప్ప కొడుకా? ఎవఁడో యనుకొంటిని. పాపము, వారికి మన గోపన్నయం దెంతటియభిమానమో, పదివేలమంది సంతకములుచేసి మహజరు పంపిరి. ఆ ఖాళీ, ఈ మహజరు, ఏక కాలమునఁ జేరుట, ఈశ్వరసంకల్పమువలె నున్నది.

**మాదన్న**—అట్లైన మఱియు మేలే. వానికి భద్రాచలము తహాశీల్దారీ యిప్పించినచో, వాఁడు కోరినరీతిని రామునిసేవయే వానికి లభింపఁగలదు. ముఖ్యముగా వాని కీయుపకారమును జేయుటయే కర్తవ్యము.

[ప్రవేశము - సేవకుఁడు]

**సేవకుఁడు**—స్వామి! నెలకొండపల్లెనుండి, తమ మేనల్లుఁడు గోపన్న గారు వచ్చియున్నారు.

**అక్కన్న**—ఆహా! అట్లనా! ముందు రమ్మనుము.

[ప్రవేశము - గోపన్న]

**గోపన్న**—పెద్ద మామయ్యా, నమస్కారము. చిన్న మామయ్యా, నమస్కారము. [అని నమస్కరించును.]

**అక్కన్న, మాదన్న**—రమ్ము, రమ్ము. గోపన్నా రమ్ము. కూర్చుండుము.

**అక్కన్న** ఏమిరా? వచ్చెదనని వ్రాయనైన వ్రాయలేదే? తలఁపులోన వచ్చితివి. ఇప్పుడు చిన్నమామ నీ విషయముననే మాటాడు చుండెను.

**గోపన్న**—తలఁపని తలంపుగా బయలుదేఱుటచే నేను ముందు మీకు తెలుప నవకాశము లేకపోయినది. నేఁడు మీ దర్శనముచే ధన్యుఁడనైతిని.

**మాదన్న**—గోపన్నా, ఇటు కూర్చుండుము. అమ్మాయి మొదలగు వారందఱును క్షేమమే కదా?

**అక్కన్న**—దానినిగూడ వెంటఁ గొనిరాలేదా?

**గోపన్న**—అందఱు క్షేమముగా నున్నారు. మేమిద్దఱమును గలసియే వచ్చినాము.

**అక్కన్న** అబ్బాయీ! ఇదివఱకు నీ కెన్నిసార్లు వ్రాసినను నీ విచ్చటికి వచ్చినవాఁడవుగావు. ఇప్పటికి ఆ రాముని యనుగ్రహమున వచ్చితివి. అదియుఁ గొంతమేలే. అందులో మఱియొక విశేష మున్నది. ఆ రాముని సేవ, రాముని సన్నిధానము నందు నీవు వహించి యొనరించుటకు, శ్రీరాముఁడు, ఇప్పుడొకయవకాశమును గల్పించియున్నాఁడు. కాన, నిన్నిపుడు సమ్మతింపఁజేయుటకుకూడ, ఆతఁడే పూనుకొనునను ధైర్యము నాకు కొంతవఱకు కలుగుచున్నది. శ్రీరాముని సేవఁజేయుటకు, నీ కభ్యంతరము లేదు గదా?

**గోపన్న**—మామయ్యగారూ! ఎంతమాట సెలవిచ్చితిరి. ఎన్ని వేల జన్మములు, కఠిన తపము సల్పినను, రామసన్నిధానసేవనము లభించునా? అది నేను వలదందునా?

**మాదన్న**—అది యుత్తమలక్షణము. ఇఁక దాఁపఱిక మెందులకు? భద్రాచలమున తహశీల్దారుపని ఖాళీపడినది. దానిని నీకిప్పింపఫలె నని అన్నగారు హుజూరువారితో విన్నవింపఁగోరిరి. ఇందులకు నీవు మాఱుమాట చెప్పవలదు. ఇది యుభయ తారకము.

**గోపన్న**— మామగారూ! ఎన్నివిధంబులఁ జూచినను, ఇదియంతయు శ్రీరామునియాజ్ఞయేగాని ఇతరము గాదని స్పష్టమగుచున్నది. ఇఁక సంశయములతో పనిలేదు. స్వామియాజ్ఞ నెఱవేర్చుటకు సర్వసంసిద్ధుఁడను.

**అక్కన్న**—ఇంతవఱకు రామునియనుగ్రహమున, అంతయు ననుకూలముగనే జరిగినది. ఇఁక అవశిష్టమునుగూర్చి, నేనే స్వయముగా తానీషాగారితో విన్నవింపఁబోయెదను. తమ్ముడూ,మాదన్నా, నీ వింట నుండి, అల్లుఁడు గోపన్నకును, వానిభార్య మనయాఁడుపడుచునకును, భోజనమజ్జనాదులను విచారించుకొనుము. భగవన్నివేదన మగునంతలో నేను వచ్చి శుభవార్తను తెలుపఁగలుగుదును.

**మాదన్న**—చిత్తము. ఎవరక్కడ? అన్నగారికి పాలకి సిద్ధపఱపుఁడు.

**సేవకుఁడు**—చిత్తము. [అక్కన్న లోనికి వెడలును.]

**మాదన్న**—అబ్బాయీ! గోపన్నా! ప్రయాణపుబడలికవలన చాల నలసియుంటివి. నేఁడు శ్రీరామనవమి. అభ్యంగనము చేయవలెను. లోనికి పోవుదము రమ్ము.

**గోపన్న**—నేఁడు శ్రీరామనవమి! చిత్తము. మనమందఱము నేఁడు తనివితీర, రామభజనము గావింతము. నేఁడు నా మిత్రులు నెలకొండపల్లెలో, మా భజనకూటమున, మహోత్సవము నీపాటికి ప్రారంభించి యుందురు. జయజయ రామచంద్ర— శ్రీరామచంద్ర. [ఇద్దఱు లోనికి వెడలుదురు.]

[తెర వ్రాలును.]

---

## రెండవ అంకము - రెండవ రంగము.

భద్రాచలము - ఇంటిముందఱి చావడి. బ్రాహ్మణులు సమారాధనభోజనముపిదప, దక్షిణ తాంబూల చందనాదులకై కూర్చుండి యుందురు.

**శంకరశర్మ**—బేష్; అన్నదాతా సుఖీభవ. మహారాజు. ఏమి భోజనము పెట్టినాఁడయ్యా. విస్తరి వరహా చేయును.

**రామబ్రహ్మము**—భక్తిశ్రద్ధలతోఁ జేసే పని అంతా ఈలాగే యుండు ననుకోవయ్యా. ఆయన మహాభక్తుఁడు. భగవద్భక్తుఁడగుట చేత, బ్రాహ్మణభక్తికూడ అతివిశేషముగా నున్నది.

**నరసింహసోమయాజి**- ఆ భగవంతుఁడు, ఆలాగున కూర్చుచున్నాఁడయ్యా. ఆయన భక్తికిఁ దగినట్లు, ఆ మహాపతివ్రత, పతి యాజ్ఞకు అడుగుదాఁటకుండ ఆయనకంటె వేయిమడుఁగులు అధికముగా శ్రద్ధతో అతిథిపూజ చేయఁబట్టియే, మఱింత శోభవచ్చినది. అనుకూల యగు భార్య లేనియెడల గృహ యజమానుఁడు ఎంత యోగ్యుఁడైన రాణింపు కలుగదు.

**వేంకటదీక్షితులు**- వారిద్దఱు పార్వతీపరమేశ్వరులలాగ పరమపవిత్రులండి. ఏమి వినయము! ఏమి విధేయత! ఏమి ఆదరణ! ఎన్ని పదార్థములండి విస్తరినిండా వడ్డించినారు. ఎక్కడ వడ్డనకు ఏమి లోపము వచ్చునోయని, వెయ్యికళ్లు కనిపెట్టినారు గదా!

**అప్పన్నజోస్యులు**—ఒకొక్క పదార్థము, అమృతతుల్యముగా ఉండినది. తఱిమితఱిమి ఒకటే వడ్డన.

**సూర్యనారాయణశాస్త్రి**—మన యదృష్టము బాగుగా ఉన్నది. గోపన్నగారివంటి పుణ్యపురుషులు మన తాలూకాకు తహశీల్దారుగా రావడము, మన పూర్వజన్మఫలము. వీరు వచ్చినది మొదలు స్వామికైంకర్యములు అసాధ్యముగా జరుగుతున్నవి. స్వామికి నిత్యము తిరువీథులవేంచేపే.

**శంకరశర్మ**—ఉండండి. ఉండండి. తహశీల్దారుగారు వచ్చుచున్నారు. ఎందఱో ధనవంతు లున్నారు. "దానేన హస్తం నతు కంకణేన" అని పెద్దలు చెప్పినట్టు, ధనమునకు సార్థకము దానము. గోపన్నగారికి అధికారము, ఐశ్వర్యము, భగవద్భక్తి, అనుకూలదాంపత్యము, వైరాగ్యము, పరోపకారచింత, దాతృ

త్వము అన్నియును భగవదనుగ్రహమువల్ల పరిపూర్ణముగాఁ గలిగినవి. [గోపన్న ప్రవేశించును. అందఱును లేచి దయ చేయుఁడు, దయచేయుఁడు అని మర్యాద చేతురు. గోపన్న వచ్చినపిదప] — మీ అబ్బాయి పుట్టినదినము సమారాధన బాగుగా జరగినది. భగవదనుగ్రహమున ఆ కుమారుఁడు చిరంజీవియై మహైశ్వర్యవంతుఁ డగునుగాక. మీవంటిపుణ్య దంపతు లొసఁగిన మృష్టాన్నభోజనమువలన సంతృప్తి కలుగుటయేగాక, మా పాపములన్నియు పటాపంచలైనవి. అన్నదాతా సుఖీభవ.

**గోపన్న**—పండితప్రవరులకు నమస్కరించుచున్నాను. నేను మీ ప్రశంసకుఁ బాత్రుఁడను గాను. సర్వమును శ్రీరామునికటాక్షము.

**అందఱు**—దీర్ఘాయు రారోగ్యైశ్వర్య ధనకనక వస్తు వాహన సంపదభివృద్ధిరస్తు. పుత్రపౌత్రాభివృద్ధిరస్తు. మహాలక్ష్మీకటాక్షప్రాప్తిరస్తు. వెయ్యేండ్లకును మీరు ఈలాగున దేవబ్రాహ్మణభక్తి కలిగి, బీదలను, సాదలను పోషించుచు వర్ధిల్లునట్లు మీ యిలువేల్పు శ్రీరామచంద్రమూర్తి కటాక్షించునుగాక యని, మేమందఱమును మనఃపూర్వకముగా ప్రార్థించుచున్నాము మీ భోజనము మహదానందము, మీ యాదరణ బ్రహ్మానందము.

**గోపన్న**—బ్రాహ్మణ ఆశీర్వాదములు పరిగ్రహించితిని. తామందఱును, సదక్షిణాకములగు నీ తాంబూలములను స్వీకరింప వేఁడెదను. [గోపన్న దక్షిణ తాంబూలముల నిచ్చును. ఆ సమయమున సేవకుఁడు ఖిన్నముఖుఁడై ప్రవేశించును.]

**సేవకుఁడు**—ఆహా! ఘోరము, ఘోరము; ఎంతటి ధర్మాత్మునకు, ఎట్టి మహాపద తటస్థించినది!

**అందఱు**—ఏమి? ఏమి?

**సేవకుఁడు**—అబ్బాయిగారు, ఏలయో, మహానసప్రాంతమున కేగి, ఎటులో, ఎపుడో, వేఁడివేఁడి గంజితో నిండినగుంటయందు పడి, గతప్రాణులైరని, అమ్మగారు పెద్దపెట్టున ఏడ్చుచున్నారు.

**గోపన్న**—హా, సీతారామచంద్రా! [అని మూర్ఛిల్లును.]

**బ్రాహ్మణులు** - హరహరా! శ్రీరామరామా! గోవిందగోవిందా! నారాయణనారాయణా! ఎంతకష్ట మెంతకష్టము!

**రామబ్రహ్మము**—వర్ధంతిపండుగనాఁడే వైకుంఠవాసమా! ఏమి భగవంతుని దయావిహీనత?

**అప్పన్నజోస్యులు**—అది పురాకృత మయ్యా! ఎవరికిఁ దప్పును?

**కామావధానులు**—"అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మశుభాశుభం." బాబూ, గోపన్నగారు! ధైర్య మవలంబింపుఁడు [అని లేవనెత్తును. గోపన్న మూర్ఛ తెలిసి లేచును.]

**గోపన్న**—

చ॥ పరమదయానిధీ వరద, పద్మదళేక్షణ, రామచంద్ర, నీ
కరుణయు దూరమాయెనొకొ, కన్నసుతుం గొనిపోయితక్కటా
నరుఁడను బామరుండ నిను నమ్మినవాఁడను, న న్నరీతి యీ
కరణిని జేయసాగితివె కారుణికోత్తమ యేమి యందు నిన్.

ఆహా! ఏమి పరమేశ్వరుని సంకల్పము బ్రహ్మాదులైన నెఱుంగ నేరరుకదా? ఏమి జీవునియస్వతంత్రత. ఉత్తరక్షణమునఁ గాఁగలదానినైన గ్రహింపఁజాలనిదుస్థితియందున్నాఁడు. తండ్రీ, నాముద్దులయ్యా! ఐదువత్సరములకే, నీ కన్నోదకఋణానుబంధము దీఱిపోయెనా? పుట్టినదినమునాఁడే, పుణ్యలోకవాసము లభించెనా? ఎట్లు భరింతును! ఎట్లు భరింతును! ఆహా, బ్రాహ్మణభోజనసమయమునకే, ఈ మహాదారుణము తటస్థించి యుండును. ఈ వార్తను వెల్లడించిన బ్రాహ్మణభోజనమునకు భంగము గలుగునని కన్నతల్లినగుటచే, సహజముగ పొంగిపొంగివచ్చు దుఃఖమును మ్రింగిమ్రింగి, ఓ కాంతా! నీ వెట్లు సహించితివో గదా! ఓ గురువరా! నేనజ్ఞానమునఁ బడిపోవుచున్నాను,

రక్షింపుము, రక్షింపుము. ఇట్టితరుణమున మీ సందర్శనము లభించిన నా కెంతయూఅట గలిగియుండును. [ధ్యానించును.]

[ప్రవేశము కబీరుదాసు పాడుచు.]

అనుబంధము 5.

**కబీరు**—వత్సా!

**గోపన్న**—[ఆతురతతో] గురుచంద్రమా! వచ్చితిరా, వచ్చితిరా, నా ప్రార్థన మీ చెవులకు సోకెనా? నన్ను దరిఁజేర్పవచ్చితిరా! ఇదే నమస్కారము, సాష్టాంగనమస్కారము.

**కబీరు**—ఏమిది నీవిట్లు అజ్ఞానమున మునింగితివి? పుత్రునిమరణమా? ఏమి వెఱ్ఱి యిది. ఇదివఱ కెన్ని జన్మము లైనవి, ఇఁక నెన్ని జన్మములు కానున్నవి? ఎందఱు తల్లిదండ్రులు, ఎందఱు పుత్రులు కడచనిరి, ఇఁక నెందఱు కానున్నారు? రామభక్తుఁడవు, వివేకధనుఁడవునగు నీ కిది చెల్లదు —

మ॥ "చెలులుం దల్లులు దండ్రు లాత్మజులు సంసేవ్యుల్ సతుల్ చారునిర్మలగేహంబు లటంచుఁ గూర్తురు మహామాయాగుణభ్రాంతులై
కలలోఁ దోఁచినయర్థముల్ నిజములే? కర్మానుబంధంబులం
గల్గుగున్ సంగము, లేకమానుఁ బిదపం గర్మాంతకాలంబునన్."

అనుబంధము 6.

**గోపన్న**—స్వామీ! పుత్రునిమృతికి నే నంతగా వగవలేదు. ధైర్యవిహీనతకే వగచితిని. అదను కలిగెనని నాయంతశ్శత్రువులు నన్ను బాధింపఁబూనుటచే, వానిని జయింప మీ ప్రాపుఁ గోరితిని, శ్రీరామచంద్రుని వేఁడుకొంటిని. నన్ను రక్షింపుఁడు, రక్షింపుఁడు.

**కబీరు**—ఇప్పుడు విచారమునకే పనిలేదు. ఇది కేవలము రజ్జుసర్పభ్రాంతి. పుత్రమరణమే లేనందులకు విచార మేల?

**గోపన్న**—స్వామీ! ఏ మంటిరి? పుత్రమరణమే లేదా?

ఆ॥ గంజిగుంటఁ బడియెఁ గన్నసుతుం డని
యెల్లవారు వినఁగ నితఁడు దెలిపె;
నది యసత్య మంటి రయ్య మీ రిప్పుడు;
మనసు సంశయమున మగ్నమయ్యె.

కబీరు - వత్సా! శ్రీరాముని కటాక్ష మున్న చచ్చుటెంత, బ్రతుకు టెంత? ఆకస్మికమరణము, శ్రీరామకటాక్షము, పునర్జీవనము. కఠినపాషాణమైయున్న యహల్యను పాదస్పర్శనమాత్రమునఁ బడఁతిఁ గావించిన పట్టాభిరామునికృపకు ఏమి యసాధ్యము గలదు? అదిగో చూడుము, నీ యిల్లాలే, నీ నందనునిఁ బిలుచు కొని వచ్చుచున్నది.

గోపన్న—[భక్తిపరవశత్వముతో] రామా - రామా - జగదభిరామా - జానకీరామా! ఏమి నీ మహిమ, ఏమి నీ కటాక్షము, ఏమి నీ భక్తజనపరిపాలనాతత్పరత్వము.

ఉ॥ "రామ! గుణాభిరామ! దినరాజకులాంబుధిసోమ! తోయద
శ్యామ! దశాననప్రబలసైన్యవిరామ! సురారిగోత్ర సు
త్రామ! సుబాహుబాహుబలదర్పతమఃపటుతీవ్రధామ! ని
ష్కామ! కుభృల్లలామ! గరకంఠసతీనుతనామ! రాఘవా!"

అనుబంధము 7.

[ప్రవేశము - గోపన్నభార్య - పుత్త్రుఁడు.]

భ్రమరాంబ [పుత్త్రునిఁ జూచి] తండ్రీ! నీవు బ్రతికితివన్న శుభవార్త విని, నీ తండ్రిగారు పారవశ్యంబున, ఆనందసముద్రమున మునింగియున్నారు. ఆయనకును, ఈ విప్రపుంగవులకును, మనము పాదాభివందన మాచరింతము రమ్ము. [భర్తనుజూచి] నాథా! శ్రీరామచంద్రుని కటాక్షమునఁ జేయితోలఁగిన ఫలము కనుగందకుండ మరలఁ జేతఁబడినది. ఇదిగో బిడ్డతోఁ గూడ అందఱికి నమస్కరించుచున్నాము. మమ్మాదరింపుఁడు. [ఇరువురును అందఱికి నమస్కరింతురు.]

**గోపన్న**—ఆహా! శ్రీరాముని కటాక్షము. కుమారా! నన్నుఁ గన్న తండ్రీ! నాతండ్రి నిన్ను మరల నాకడ కంపెనా? శ్రీరామచంద్రమూర్తికి నాపై సంపూర్ణమగుకటాక్షము కలదా? సాధ్వీమణీ! ఇఁక మనము ధన్యులము. రాముఁడు మన ప్రార్థనల నాలించెను. [కబీరుదాసునకుఁ దిరిగి] గురువర్యా! నన్ను రక్షించితిరి, పుత్రభిక్షమిడితిరి. రామునికృపకు నన్ను పాత్రునిగఁ జేసితిరి. ఇఁక మాకు దిక్కు మీరే. [అందఱు నమస్కరింతురు.]

**కబీరు**—అయ్యో! ఇదేమివెఱ్ఱి? నేనా నీకు దిక్కు? మనకందఱకును దిక్కగువాఁ డొక్కఁడేకాక వేఱొకండు గలరా? తన భక్తవాత్సల్యము జగద్విదిత మగునట్లు, నీపుత్రుని నీ కొసఁగిన శ్రీరామచంద్రుఁడే, ఎల్లరకును దిక్కు. అతనిఁ గీర్తింపుఁడు.

**రామబ్రహ్మము**—మహాభాగ్యము, మహాభాగ్యము. కారుమబ్బు ఝుంఝూమారుతముచేఁ దొలఁగినట్లు, మహావిపత్తు పరమ భక్తాగ్రగణ్యులరగు మీ రాకవలన క్షణములోఁ దొలఁగి పోయినది. ఓమహాపురుషా! నీవు జాతిచే తురుష్కుఁడ వయ్యును, మాహాత్మ్యమునందు సనకసనందనాదుల మించి యుంటివి. సర్వజనపూజ్యుఁడవగు నీకు సుపర్వులైన నీడుగా రనిన, ఇఁక నూబోంట్లు ఏమిలెక్క? నీ వేకాంతభక్తుఁడవు. నీ శిష్యుఁ డగు నీ గోపన్నయు పరమభక్తుఁడు. మిమ్ము ప్రశంసించుటకైన మా కర్హత లేదు. మీ సందర్శనముననే నేఁడు మేము పావనులమైతిమి. ఐనను, మీరు అహమహమిక యని తలంపకుందురుగాక. ఈ గోపన్నగారు, నిరంతరరామసేవాధురంధరు లగుటచేతను, శ్రీరాముని కటాక్షముననే, కోల్పోయినపట్టిని మరలఁ బడయఁగల్గినవా రగుటచేతను, నేఁడు మేమందఱమును మనఃపూర్వకముగా నీ భక్తాగ్రగణ్యునకు "రామదాసు" అను గౌరవనామము నొసంగుచున్నాము.

**కబీరు**— సంశయమా? అది సార్థకనామమే! రామదాసు-రామదాసు-రామదాసు. [అని ఆశీర్వదించి పాడుచు వెళ్లును.]

అనుబంధము 8.

**రామదాసు** — [పిదప బ్రాహ్మణులఁ జూచి] ఓ భూసురోత్తములారా! మీకు నాయందు దిట్టియవ్యాజకరుణ కలుగుటకుఁగూడ నా శ్రీరామునికటాక్షమే కారణము. నేఁటి సపర్యలలో నెన్నియో లోపము లుండియుండును. మీరు వానినన్నింటిని మన్నింపవలయు నని సతీసుతసమేతముగ నమస్కరించి వేఁడుకొనుచున్నాఁడను. [బ్రాహ్మణులు పనసచెప్పి ఆశీర్వదింతురు.]

అనుబంధము 9.

(అందఱును నిష్క్రమింతురు.)

---

మూఁడవ అంకము - మొదటి రంగము

కొండపల్లె - బ్రాహ్మణగృహము రామశాస్త్రి, అతనిభార్య వీరమ్మ.

**రామశాస్త్రి** — చూచితివా! పాప మా గోపన్నగారిని, మనయూరిలోని యాడవారలందఱు నాడిపోసికొన్నారుగాని భగవంతుని నమ్మినవా రెప్పటికిని బాడైపోవరు. మల్లి ఎక్కడ ననుకొన్నావు? భద్రాచలములోనే తహశీల్ దారీ అయినది. ఇఁకమీఁద నీ వెఱ్ఱిమాటలు కట్టిపెట్టుము.

**వీరమ్మ**—ఏమిటీ? గోపన్నగారికి తహశీల్ దారీ అయినదా?

**రామశాస్త్రి** — ఇంకను వేళాకోళములేా కలగనలేదు; ఇదిగో యుత్తరము. అతఁడు భద్రాచలమునుండి స్వయముగా వ్రాసియున్నాఁడు. అతని ప్రేమ అమాయకపుఁ బ్రేమ. ఆయనకు గర్వమన్న మాట లేశమైనను లేదు. తమ్ముఁడు, రామశాస్త్రీయని వ్రాసియున్నాఁడు చూడుము. మనయూర నందఱి యోగక్షేమమును పేరుపేరున వరుసగ నడిగిన ట్లుదాహరించియున్నాఁడు.

వీరమ్మ—పోనిత్తురు. ఎప్పుడు ఒకరి యైశ్వర్యము చూచి సంబరపడ డమే యైనది మనబ్రదుకు. మనకుఁ గలిసివచ్చునది ఏమైన నున్నదా? ఎట్టిదియేగానియు లేదు. ఇప్పుడు గోపన్నగారికి తహశీల్దారీయైతే మన కే మొల్కినది? మంచివాఁడు, మంచివాఁడు అంటారు. ఏమి టామంచి గడమంచి? తమ్ముఁడా, అని వ్రాసినాఁడఁట! ఏమి సంతోషము? తానీషామంత్రులు తన మేనమామలు; తన కేమి తక్కువ? మీమాట కొంత వారలతోఁ జెప్పి మీ కొక ముసద్దీపనియైనా వేయించఁగలిగి నాఁడా? ఎవరినఱకు వారు చూచుకొందురు.

రామశాస్త్రి—నీది మిక్కిలి పాడుస్వభావము సుమా! ఒకరిని నిందించు టయే నీకు సంతోషమువలె నున్నది. మన మనస్సులో నేమున్నదో అతని కేమి తెలియును, ఏమిటి? అదిగాక అతఁడు వెళ్లినది క్రొత్త. ఆయనకు మొగమోటమి ఎక్కువ. మనము వెళ్లి యాతనితో మాట్లాడితే, ఏదో చేతనైన సాయము చేయనేచేయును.

వీరమ్మ—కాదండీ, మీకంటె గోపన్నగారు ఏమిటి ఎక్కువ? చదువు సంధ్యలలో, కులగోత్రములలో, ధనధాన్యములలో, మీకు తక్కువలేదు, వారి కెక్కువలేవు కాదంటే, ఒకవేళ వారి మేనమామలు గొప్ప యధికారములో నుందురనుటయే. మీ కట్టి వెనకాసరాలేమియు లేవు. ఈసంగతి వారికి తెలి యదా? తెల్లవారి లేచినది మొదలు తలలో నాలుకలాగు, మీరు వారి మాట అనిన, అడ్డులేకుండ అన్నిటికి ఆదుకొనే వారుకదా? మీకామాత్రము సహాయము చేయుదమని వారికి ఎందుకు బుద్ధి పుట్టఁగూడదు? ఇదియా మంచివారికి లక్షణ మని యడిగెద. పోనీ, ఇప్పటికైన మిమ్మును ఏమైనా రమ్మని వ్రాసెనా? ఆ ముక్క లేనేలేదు. ఏలాగైనా, మీరు పట్టుఁ బట్టి, ఏ యుపాయముచేతనైన, గోపన్నగారిలాగు తహశీల్

దారీ సంపాదించకపోయిన, మనల నందఱుకూడ[illegible]ల. అగౌరవముచేయుదురు?

రామశాస్త్రి—[తలయూఁచుచు] ఔను, ఔను; నీవు చెప్పినదానిలోఁ గొంత నిజమున్నది. ఎందుకైనా, ఇఁక నీయూర మన ముండఁగూడదు. నేను భద్రాచలము వెళ్లివచ్చెద.

వీరమ్మ—ఇదిగో! మీరు ఒక్కరు వెళ్లిన కల్లుఁద్రాగిన కోఁతికి తేలు కుట్టినట్లు, గాముని, గోపన్న గారిని చూచుసరికి, మీరీలోకమే మఱచిపోతారు. వెనుక నాబోఁటిదియుండి పొడుచుకు తినుచుండిననే దిక్కులేదు గనుక, ఆలాగున పనికిరాదు. మన మిద్దఱము కలిసియే వెళ్లుదాము. శీఘ్రముగ పంచాంగము చూచి ముహూర్తము పెట్టుఁడు.

రామశాస్త్రి—నాకు జ్యోతిషములో అట్టె ప్రవేశములేదు. సీతారామ సిద్ధాంతిగారింటికి వెళ్లి ముహూర్తము పెట్టించుకొని వచ్చెద. మనము కలిసియే వెళ్లుదము.

వీరమ్మ—త్వరగా వెళ్లరండు. ఆలస్య మమృతం విషమన్నారు. మీరు అంగీతొడుగుకొని, తలపాగా పెట్టుకొని, అడేజావు బడేజావులతో, బిళ్లబంట్రౌతులతో, పంట్రండుబోయిలపల్లకీ నెక్కి తహశీల్ దారీ అమలు చలాయించుచుండ, ఎప్పుడు చూచెదనో అని యున్నది. వంట అయినది, కూర చల్లారిపోవును, త్వరగా పోయిరండు. [రామశాస్త్రి పోవును] ఇఁకచూడు, ఆ పక్కయింటి అగపిల్ల కామాక్షి పొగరు అణగదొక్కుతా!

(నిష్క్రమించును)

---

## మూఁడవ అంకము - రెండవ రంగము

భద్రాచలము – రామదాసుగారి యింటిలో నొక గది. రామదాసు కుమారుఁడు రామమూర్తి, రామునకు పూజ గావించుచుండును:—

## అనుబంధము 10.

శ్లో. "శ్రీరామో రఘునాయకో రఘువరో రాజీవనేత్రాంచితో
రాజేంద్రో రఘుపుంగవో రఘుకులోత్తంసో రఘూణాంపతిః
రామో రాక్షసనాశకోఽమితబలో రాకేందుపూర్ణాననో
రాజత్కింకిణికంకణాంకితకరో రామ స్సదా పాతు నః."

[శ్లోకము చెప్పినతరువాత కర్పూరహారతి నిచ్చును. ఆ సమయమున రామదాసును, అతని భార్యయు నేతెంతురు. రామమూర్తి తలిదండ్రులకు నమస్కరించును. వారు ముద మొంది యాశీర్వదింతురు.]

రామదాసు--సతీమణీ! నేఁడు నిక్కముగా సుదినము. రాముని కటాక్షము మనకు ప్రత్యక్షముగ గోచరమైనది:—

చ॥ తరుణిరొ! రామచంద్రుఁడన - ధాతకుఁదండ్రిపరాత్పరుండుమో
క్షరమకు నాయకుండును వి-శాలయశశ్శశిశోభితుండు, భ
క్తరతుఁడు సత్కృపాజలధి - గావున నాశ్రితకోటి కెల్ల సా
దరమున నైహికం బొసఁగి, తప్పక మోక్షముగూడ నిచ్చెడున్.

భ్రమరాంబ- నిశ్చయము. పిల్లవాని పుట్టినదినపు వేడుక సాంతము గాకుండ, మహాపద ప్రాప్తించెనని, నేను చాల చింతించితిని గాని, మీ భక్తివలనను, మీ గురుని మాహాత్మ్యమువలనను, సీతారాములు మనపై కరుణ గలవారై బాలుని పునర్జీవితుని గావించిరి. నాథా! మనజన్మము సార్థక మగునట్లు మన మేమి చేయఁగలుగుదుము?

రామమూర్తి--తండ్రీ! నాకు ప్రాణదాన మొసంగిన యాశ్రీరాముని, వేనోళ్ల నుతించినను దనివి దీరదు. అట్టిశ్రీరాముని, జానకీరాముని, తారకనాముని, అనుదినమును నాతోడిబాలురతో సేవించుటకు, నా కొక చిన్నకోవెలను గట్టించియిమ్మా!

భ్రమరాంబ—నాయనా! నీ భక్తి నెంతయని కొనియాడుదును. [బాలుని ముద్దాడును] నాథా! పిల్లవానికోరిక సులభముగా నీడేర్ప నగునా?

రామదాసు—పౌలఁతీ! కుమారా! రాముని కటాక్షముండ, ఏది యసాధ్యము? చిన్నకోవెలను గట్టించుట గాదు. జీర్ణదేవాలయోద్ధారణసంకల్పము నిదివఱకే నాకు రామచంద్రుఁడు కలిగించినాఁడు. తొల్లి తమ్ములదమ్మక్క, శ్రీరాములకుఁ గట్టించిన కోవెల చాల జీర్ణముగా నున్నది. ఆ దేవదేవుని ఆసేతుశీతాచలము గల ప్రజలందఱును సందర్శించి సేవించుటకు, ఈమహాక్షేత్రమునకు వచ్చుచుందురు కాన, ఆ రఘురాముని ఘనతకుం దగురీతి నొక గొప్ప దివ్యదేవాలయమును గట్టింప నుద్దేశించెదను. అప్పుడు సమస్తజనులు రాము ననవరతము సేవింపవచ్చును:—

తే॥ రామమూర్తికి నిర్మింతు రమ్యరీతి
నాలయము మండపంబుల నర్హగోపు
రములఁ బ్రాకారములఁ బుష్పరాజితోఁడి
వనములను దైర్ఘికులు హర్షమున మునుంగ.

రామమూర్తి—తండ్రీ! మిక్కిలి సంతోషము. ఆహా! ఏమి రాముని ప్రభావము. తలఁచినమాత్రముననే కార్యసిద్ధి గలుగుచున్నది:—

సీ॥ ఎవ్వానిశుభనామ మేవేళఁ బార్వతీ
పరమేశ్వరులు జపింతురు సతమ్ము,
ఎవ్వాని నొకసారి హృదయమ్మునఁ దలంప
ఘోరపాతకరాశి దూరమగును,
ఎవ్వాఁడు శరణన్న నెట్టివాఁడైన నా
ర్తి హరించి ప్రోవంగ దీక్ష పూనె,
ఎవ్వాఁడు రణభూమి నేకాకిగా నిల్చి
యసురులఁ బరిమార్చి యశము గాంచె

ఎవఁడు ననుబోటిదీనుల నేలుకొనుటకు
భద్రగిరిపైని దమ్ముతో భార్యతోడ
నిండుదయతోడ వేంచేసి యుండె నట్టి
శ్రీరఘుస్వామిమహిమ వర్ణింపఁ దరమె?

భమరాంబ--కుమారా! నీ వెల్లప్పుడు రామునికృపకు పాత్రుఁడవగు దువుగాక. నాథా! మీ యుద్దేశ్యము శ్రేష్ఠతమమైనదియేకాని యందులకు లక్షలు, కోట్లు ధనము కావలెనే? మీ జీతమంత యును కుటుంబపోషణమునకే చాలకుండనున్నది. పట్టుపుట్ట ములను, రత్నాభరణములను మనమపేక్షింపకున్నను, దాన ధర్మము లొనరించుటకుఁగూడ వెలితిగనే కనఁబడుచున్నదే; అట్లుండ, మీ రెట్లు ఈ ఘనకార్యమును సాధింపఁగలుగు దురు?

రామదాసు--పొలఁతీ! సర్వకార్యముల నెఱవేర్చుభారము జగదీశ్వరుఁ డగు శ్రీరామచంద్రునిదైయుండ, మనకేటి కీసంశయములు? మనలను ఈ భద్రగిరికిఁ గొనివచ్చినది రాముఁడుగాదె? విగత జీవుఁడైన పుత్రుని పునర్జీవితుని గావించినది రాముఁడుగాదె? నిరంతరము తన పాదసేవ మనకు ప్రసాదించినది రాముఁడు గాదె? అట్టి శ్రీరాముఁడు, కృపారాముఁడు, జగదభి రాముఁడు, ఈ కార్యము నెఱవేర్చుటకుఁ దారిఁజూపఁడా?

ఉ॥ తాటకిని దాటకం దునిమి, యాగము గాచి, యహల్యఁ బ్రోచి, సీ
తాలలనన్ వరించి, రణదర్పితరావణ కుంభకర్ణ ము
ఖ్యాళి వధించి, రాజ్యము నయంబుగ నేలిన, రామచంద్రభూ
పాలుఁడు రంగశాయి మనపాలఁ గలండు విచార మేటికిన్?

ఈ విషయమునుగూర్చి యాలోచించుటకై తాలూకాప్రజ లకు, తోడియుద్యోగులకు నేఁడు కచ్చేరీకి రా వార్త నంపియుంటిని. వార లిప్పటికి వచ్చియుందురు. నేనిప్పుడేపోయి వారితో నాలోచన చేసి సర్వము నాయత్తముచేసి వచ్చెదను.

(నిష్క్రమింతురు)

---

## మూఁడవ అంకము - మూఁడవ రంగము.

భద్రాచలము - తాలూకా కచ్చేరీ. రామారావు (శిరస్తాదారు), రెడ్డి, కరణము మున్నగు నుద్యోగస్థులు, కొందఱు పురజనులు, తహశీల్ దార్ రాకకై యెదురుచూచుచుందురు.

**సుబ్బానాయుఁడు**—ఏమండీ, శిరస్తాదారుగారు, ఈవేళ మమ్మందఱిని పిలిపించిన విషయము కొంచెము సెలవిచ్చెదరా?

**నరసింహగుప్త**—ఇది సర్కారువ్యవహారమా లేక సొంతవ్యవహారమా? పన్నులు గిన్నులు ఏమియు చఢావులేవు గదా? ఆ మాట కొంచెము చెప్పండి?

**రంగరాజు**—పన్నులుగిన్నులమాట మీ కెందుకు? ధరలు తగ్గలేదు గదా! లూటీలు గీటీలు లేవు గదా, అని అడుగవయ్యా?

**నరసింహగుప్త**—ఏమీ! నామాటయంటే అంత లోఁకువగా నున్నది? మాకేమి భయమయ్యా, మీవంటి రాచకొమారులు, వారివంటి సర్ దార్లు, మేటిబంట్లలాగున నుండఁగా, లూటీలేమిటి - గీటీలేమిటి? మే మాలాగున జడియువారము గాము-న్యాయముగా లాభము తీయువారము.

**వేంకటశాస్త్రి**—ఉండవయ్యా! అసలు ఈ గొడవ కానేకాదు. ఏదో సంతర్పణయో, సమారాధనయో యున్నది. బహుశః నవరాత్రిమహోత్సవము, శ్రీరాములవారి కోవెలలో జరిగించడమని అనుకొనెదను. నిత్యము వేయిమంది బ్రాహ్మణ్యానికి సంతర్పణ జరగవలెను. సహస్రనామార్చనలు జరగవలెను.

**శిరస్తా**—అనసరపడకుఁడు. తహశీల్ దారువారే వచ్చి కార్యము సెలవిచ్చెదరు.

**డఫేదార్**—అయ్యా, తహశీల్ దారువారు దయచేయుచున్నారు.

[అందఱును లేచి తహశీల్ దార్ వారికి నమస్కరించి, తమ తమ స్థానములఁ గూర్చుందురు.]

**రామదాసు**—[రామధ్యానము గావించి] సోదరులారా! వందనములు. ఆలస్యమునకు మీరందఱు క్షమింపవలెను. శ్రీరామచంద్రుని యాలయమండపాదుల నిర్మాణమునుగూర్చి యాలోచించుటకై, మిమ్మందఱిని రావించితిని. మనకందఱకును అతి ముఖ్యమైన విషయము శ్రీరాముని కైంకర్యమునకంటె వేఱొక్కటి లేదు. ప్రస్తుతవిషయ మేమనఁగా, ఈభద్రాచలమునందు వైకుంఠనాయకుఁడు లోకహితార్థము శ్రీరామమూర్తిగా వెలసియున్నాఁడు. తొల్లి మహాభక్తురాలగు తమ్మలదమ్మక్క యనునామె, తన జన్మము సార్థక మగుటకు, ఆ దేవదేవునకు నొక చిన్నయాలయము గట్టించెను. అపుడీప్రాంతము మహారణ్యముగా నుండెను. క్రమక్రమముగా, నా మహారణ్యము జనపదముగా మాఱుటవలనను, శ్రీరామమూర్తిమహిమ లోకమున నధికముగా వ్యాపించుటవలనను, పలువురు భక్తులు శ్రీరామసందర్శనార్థము భద్రగిరికి వచ్చుచున్నారు. కాని, వారందఱికి సేవాకైంకర్యాదుల ననుకూలముగ జరపుటకుఁ దగిన యాలయ మండప ప్రాకారాదులును, అలంకార వాహనవైభవాదులును లేకుండుట, చాల లోపముగా నున్నది. ఈ లోపములు దీఱునట్లుగా నొక గొప్పదేవళమును గట్ట నుద్దేశించెదను. ఇందులకు మీ యభిప్రాయములు వినఁగోరెదను.

**శిరస్థా**—ఆహా! ఆ రామదేవుని నిర్హేతుకజాయమానకటాక్ష మిహపరతారకమైనదనుటకు ఎట్టిసంశయమును లేదు. కాని, నేను ముందు తమకు విన్నవించిన రీతిని, ఇందులకు అమితధన ముండకున్న నెఱవేఱదుగాన, ఆ విషయము ముఖ్యముగా యోజింపఁదగియున్నది.

**రామదాసు**—మీరు చెప్పినది నిక్కమే. ఏ కార్యమైనను నెఱవేఱవలెనన్న, అంగబలముతోడ నర్థబలము నుండి తీఱవలయు. మన తాలూకాలోని ప్రజలందఱును, రామభక్తిపరాయణు

లును, త్యాగశీలురునై యున్నారు. అట్టివా రిట్టి యుత్తమకార్యమునకు యథాశక్తిని ధనమొసంగి తోడ్పడుటకు వెనుదీయరు. ఇంకొక విషయముగూడఁ జెప్పవలసియున్నది. ధరాపరిపాలన మొనరింప సర్వేశ్వరునిచే నియమితులగు తానీషావారికి నిది ప్రధానకర్తవ్యమై యున్నది. వారికి మనము వ్రాసిన, నిరభ్యంతరముగ వారు నంగీకరింతురు వారి చెంత ప్రధానమంత్రులుగానున్న నా మేనమామలు అక్కన్న మాదన్నగార్లు, రామభక్తులగుటచే సర్వవిధముల విన్నవించి, ఇందులకుఁ దానీషాగారిని మెప్పింపఁగలుగుదురు. మాటవరుసకు నొకవేళ తానీషాగారు సమ్మతింప రనుకొనినను, శ్రీసీతారాముల కటాక్షమున, మహైశ్వర్యసంపన్నులైన నా మేనమామలే, ఈభారము నంతయు వహింపఁగలరు. తప్పక వహించెదరు. ఇది నిస్సంశయము. కావున, అర్థమునుగూర్చి నా కంతచింత లేదు. నాకుఁగావలసినది, మీయంగబలము.

సుబ్బానాయుఁడు — ఏలికా! తా మింతదూరము చెప్పఁబనిలేదు. తాలూకాప్రజలలో నొక్కరుగూడ ఇందులకు వెనుదీయువారు లేరు. కాని, ప్రజలకందఱకు ఈ వార్తఁ దెలిపి ధనమును ప్రోగుచేయుట శీఘ్రముగ జరగుపని గాదు. కొన్నినెలలైనను పట్టకమానదు.

రామదాసు—సోదరులారా! మీ వాక్యములు నాకు మిక్కుటమగు ధైర్యమును గలిగించినవి. ధనము చేకూరుటకుఁ గొంత యాలస్యమగునను సంశయముతో మనకుఁ బనిలేదు. నన్ను నిమిత్తమాత్రునిగా నొనరించి మీ యందఱి సాయమున నిక్కార్యము నవశ్యము నాచే నెఱవేర్పించుటకు నా తండ్రి సంకల్పించె ననుటకుఁ బ్రబలనిదర్శనము గనఁబడుచున్నది. ఇదివఱ కెంతకాలమునుండియో వసూలుకాకుండిన దొరతనపువారిపైకము, ఆఱులక్షల రూపాయ లనాయాసముగ నతిశీఘ్రముగ, రఘుస్వామికటాక్షమున వసూలైనవి. ప్రస్తు

తము దానిలోనుండి ధనమును వ్యయపఱిచి పనులను ప్రారంభింతము. ఇంతలో ప్రజలవలనను, ప్రభువులవలనను లభించిన ధనముతో దానిని పూర్తిచేయవచ్చును.

శిరస్థా—నే నొక్కసంగతి మనవిచేయ సాహసించినందులకు క్షమింతురుగాక. నే నీధర్మకార్యము నష్టపెట్టుచున్నానని తలంపవలదని ముందుగఁ బ్రార్థించుచున్నాను. మీరు పరమధార్మికులు. లోకమంతయు మీవలెనేయుండునని భావించెదరు. ఈ కలియుగమున నది కల్ల. ధార్మికులకే పలువు రపకారమొనర్పఁ దలఁచియుందురు. కాన, సర్కారుపైకమును వ్యయపఱచుటకు ముందే, వారి అనుమతిని బడయుట యుక్తమమని విన్నవించుచున్నాను లేకున్న, రంధ్రాన్వేషులు గూఢచారులవలన నీమాట విని, మీరు తానీషావారికి వ్రాయుటకుముందే, మీపై లేని నేరములను గల్పించి, వారితో విన్నవించినచో ప్రమాదము కలుగవచ్చును. మఱియు రాముఁడు మనకు దేవుఁడుగాని, తానీషావారికి దేవుఁడు గాఁడు. పిమ్మట తమచిత్తము.

రామశాస్త్రి—శిరస్థాదారులు చెప్పినమాటలు యథార్థమేగాని, శ్రీరాములకటాక్షము మున్నంతవఱకు మన కేవిధమైన భీతియు నక్కఱలేదు. ఇన్ని సంవత్సరములుగా, ఆఱులక్షల పైకము నిలువబకాయి బాకీగా ఉన్నప్పుడు తానీషాగారు ఏమిచేయఁగలిగినారు? మీ కాలములో ఈ ధనము వసూలైనందుకు, తానీషాగారు సంతోషింతురేకాని వేఱుగాదు. అట్లుండ, ముందుగా ఖర్చుచేయుటవలన నేవిధమైన యాక్షేపణయు నుండదు. మఱియు, ఈ ధనము ఆయనకు ఒక లెక్కలోనిది కాదు. మీరు రామభక్తులు గాన, మీచేతిమీఁదుగానే, ఈ ధర్మకార్యము కొనసాగించుటకే కదా ఇంత శీఘ్రముగా ఈ ధనము వసూలగునట్లు శ్రీరామచంద్రుఁడు కటాక్షించెను. హిందువులుగూడ తానీషావారి ఏలుబడిలోనివారే కాన,

హిందూప్రజలకోరిక తీరునట్లు, వారి దేవాలయములను నిర్మించుటగూడ, తానీషావారికి ముఖ్యకర్తవ్యమై యున్నది. ఇవియన్నియుఁ దమకుఁ దెలియనివిషయములు గావు. ఎందుకైనను స్వామికార్యము ఆలసింపరాదు.

రామదాసు రామశాస్త్రిగారు చెప్పినది సరిగనున్నది. మన మీధనమును, మన కుటుంబములకుఁగాను వ్యయపఱచుటలేదు. స్వామికైంకర్యమునకు వ్యయపఱచుచున్నాము. అట్టిచో స్వామి మనల నుపేక్షించునా? అదిగాక తానీషాగారుత్తమోత్తములు. నిష్కారణశత్రువు లుందు రనియే భావించినను, మా మేనమామల సన్నిధానమున నెవ్వరి మాటలును జెల్లవు. నేనిట్లు చెప్పితినేకాని, మీయాలోచన నసడ్డచేయను. కార్యారంభముతోడనే, తానీషావారికిని, మా మేనమామలకునుగూడ జాబులువ్రాయుదును. వారి ధనసాహాయ్యము నర్థించెదను. • రామభక్తులమగు మనకా హానికలుగుట? అట్టి భయము మన కెన్నఁటికిని వలదు. అట్టితలంపు మనకు శ్రీరామచంద్రునియందు సంపూర్ణవిశ్వాసము లేదని వెల్లడించు. దానిమాట కేమి? మీలో ప్రతివారును ఈ కార్యమును సొంతకార్యముగా భావించి నాకుఁ దోడ్పడి, సీతారాముల కటాక్షమునకుఁ బాత్రులగుదురుగాక.

ప్రజలు—మేమందఱమును సర్వసిద్ధముగ నున్నారము. ఇంతకన్నఁ జరితార్థ మేమి గలదు? ఒడలు దాఁచుకొనక చేతనైనపనుల నన్నింటిని జేసితీరెదము. మ ముద్ధరించుటకు, ఆ రామదేవుఁడే, మి మ్మీ తాలూకాకు తహశీల్ దారుగా కొనివచ్చెను. ఇది మా పూర్వపుణ్యము.

రామదాసు—పరమసంతోషము. ఈ కార్యము నెఱవేఱునా, నెఱవేఱదా, అనుచింతయే మన కక్కఱలేదు. ప్రేరణకర్త రాముఁడు. పనిచేయువాఁడు రాముఁడు. కార్యమా రామునిది. సంకల్ప మీడేర్చుకొనువాఁడు రాముఁడు. మన మా

మహనీయుని చేతిలోని తోలుబొమ్మలము. చేయుటకు చేయకుండుటకు మన కెక్కడికర్తృత్వము? మనము కర్తల మనుకొనుట యహంభావము, పాపమూలము. అట్టిచింత మనకు వలదు. మన భారము లన్నిటిని, ఆ భక్తవత్సలుఁడే వహించి, అనుక్షణమును మనలను గాపాడుచుండ, తన దేవాలయ నిర్మాణభార మేల వహింపకుండును? జయ, రామజయం, సీతారామజయం. [ఈ మాటలు అందఱునుకూడ చెప్పుదురు.] అట్లైన, నిందులకు మీరందఱును సమ్మతించినట్లే కదా?

**శిరస్తా.**—నిరభ్యంతరముగా సమ్మతించితిమి.

**సుబ్బానాయుఁడు**—ముమ్మాటికి సమ్మతించితిమి.

**పౌరులు**—వెంటనే కార్యము ప్రారంభింపుఁడు. మేమందఱమును సంసిద్ధులమై ఉన్నాము.

**రామదాసు**-శుభస్య శీఘ్రం, సర్వస్సుమంగళానిభవంతు. మంచి ముహూర్తమును చూచి, వెంటనే, నేఁడో, రేపో ప్రారంభింతము. రండు, మనమందఱమును స్వామిదేవాలయముకడకేగి, జరగవలసిన యేర్పాటులు చూచివత్తము.

(నిష్క్రమింతురు)

---

మూఁడవ అంకము నాల్గవ రంగము

భద్రాచలము-బ్రాహ్మణగృహము. రామశాస్త్రి, అతని భార్య వీరమ్మ

**వీరమ్మ**—ఏమి! మనము వచ్చి నెలదినములయినవే, గోపన్నగారేమి తేల్చలేదా? ఏమో చాల సంబరపడితిరి, కౌఁగిలించుకొనినారని చెప్పితిరే, అంతేనా, ఆవలి కథ ఏమైనా ఉన్నదా లేదా? నేనుకూడ రెండు మూడు తూర్లు భ్రమరాంబగారిని చూచి వచ్చినాను. మన మీ ఊరు రావడము చాల సంతోషముగా నున్నదని యామెగారు చెప్పినారు. వేఱే కాఁపురమెందుకు,

మూయింటనేయుండరాదాయని చెప్పినారు. అయినను, ఉద్యోగముకొఱకు వచ్చినవారలమేకాని, చుట్టఱికముకొఱకు వచ్చిన వారలము కాము గదా, అక్కడసైతము మీ యన్నమే, ఉప్పుతో తొమ్మిది మీరే పంపుచున్నారు, అన్నాను.

రామశాస్త్రి—ఔను; ఆయనకూడ ఆలాగే యన్నారు. ఈవేళ ఉత్తరు విచ్చినారు. "ప్రస్తుతము జవాబు నివీస్‌పని ఖాలీగానున్నది. అందులో ప్రవేశింపుము, క్రమముగఁ బెద్దయుద్యోగము లగున"ని చాలదూరము చెప్పినారు. ఏదో యొకటి ప్రవేశము కలిగితే, ఎందుకైనా మంచిదని యొప్పుకొనినాను.

వీరమ్మ—మంచిపనిచేసితిరి. తహాశీలుదారువారికి మీరు ముఖ్యస్నేహితు లని తాలూకావారందఱికి మీమీఁద గౌరవము ఏలాగైన నుండును. అందువలన ఏదో వచ్చుబళ్లుండియే తీరును. మీరుమాత్రము గోపన్నగారిలాగు మడిగట్టుకొని కూర్చుంటే లాభములేదు సుమండీ. మనము పిల్లలుగలవారము. కాయా, కసరు, రాఁబడుతుండవలె. లౌక్యులకు లంచాలు పంచాలే ఆధారము. భక్తిదారి భక్తిదే, భుక్తిదారి భుక్తిదే.

రామశాస్త్రి—నీవేలాగైనను గట్టిదానవు. నీ యాలోచన వినుటలో చాల లాభమున్నది. ఆలాగే చేసెదను. గోపన్నగారు, రాములవారికి గుళ్లు గోపురాలు కట్టించుచున్నారు. పని చాలమట్టుకు జరిగినది. ఆ పెత్తనము నామీఁదనే యుంచినారు. ఆ పని పూర్తి అయ్యేవఱకు, నే నింకొకపని చూడ నక్కఱలేదన్నారు.

వీరమ్మ—ఆలాగా! [ఆశ్చర్యముతో] ఏమండోయి మంచినడుపు వచ్చినది. సరకులు కొనడములోను, పనివారలఁ బెట్టడములోను, మూఁడు ఖర్చైతే నాలుగు పద్దు వ్రాయుచుండవలెను. లేకపోయిన అంతా లఘాధికారు లేలాగగుదురు? రాజులసొమ్ము రాళ్లపాలన్నారు. కొంత రాముడి గుడికి కష్టపడి పనిచేసినందుకు, నీళ్లమీఁది నిగ్గు మనకు. అయిన, ఈ డబ్బంతా ఎక్కడిది గోపన్నగారికి?

**రామశాస్త్రి**—[రహస్యముగా] సర్కారుఖజానాలోనిదని చెప్పుకొనుచున్నారు. అక్కన్న మాదన్నగార్లిచ్చిరని కొందఱు చెప్పుకొనుచున్నారు. దానికూపీ తీయుచున్నాను.

**వీరమ్మ**—ఏమిటేమిటి? ఇదిగో, ఇది చాలా ముఖ్యవిషయము. మీకు తహశీలుదారీ కావలయునేని మీరు రహస్యము బ్రహ్మకును దెలియకుండ, నీ విషయములో కట్టుదిట్టముగా పనిచేయవలయు. దాని రహస్యము తెలిసికొని నాకుఁ జెప్పుఁడు. పిమ్మట నేను జెప్పెదను. ఈ విషయములో బహుసాహసముండవలె. ధర్మపన్నాలు పనికిరావు. ఏమి? నేఁ జెప్పినది జ్ఞాపకముండనిండు. దీపముండఁగానే వెతుక్కోవలెను. (అని లోనికి వెళ్లును.)

**రామశాస్త్రి**—అంతా గందరగోళంగా ఉంది దీనితో వ్యవహారము. నా మనస్సునకు కొద్దిగా మొదట కష్టముగా కనఁబడుచున్నది కాని, అది చెప్పేమాటలో మాత్రము లాభము లేకపోలేదు. తనకుమాలిన ధర్మము లేదన్నాఁడు. [యోజనతో] దీపము ఉండఁగానే వెతుక్కోవలెను' సరిసరి, నాకు నర్థమైనది. ఇదే మంచియాలోచన. తురకవజీర్లు, అక్కన్న మాదన్నగార్లపై కుపితులై, వారిని అవమానపఱచుటకు సమయము వేచియున్నారు. ఈ ఆఱులక్షల పైకము సర్కారు ఉత్తరువులేక గోపన్న వ్యయముచేసినది వజీర్లకుఁ జెప్పి వారిమూలమున కార్యసిద్ధి చెందెదను.

(నిష్క్రమించుచు)

---

## నాల్గవ అంకము - మొదటి రంగము.

గోలకొండ - తురకవజీరు నాజర్‌జంగు మందిరములో నొక గది.

**సేవకుఁడు**—బడామంతుర్లు, అక్కన్న మాదన్న అయ్యవార్లు, జాత్ర పోయిన ఎన్క, ఈవజీర్లవద్ద కొల్వుసేయ్యాలా వచ్చింది! వారు

లేని షమ్‌యంలో, వీరు పాదుషాకి ఏలాగైన వారిమీాద చాడీచెప్పి, వార్కి హగార్వం శేయ్యాలా ఆలోచన శేస్తు యుండార్. అయితే, పాదుషాకి, బమ్మన్‌మంతుర్లుమీాద బహుత్ గార్వం యుండాది. అయ్యల్ మకాంలోయుంటే వజీర్లహాటల్ సాగ్తాయిలేదు. హంతటికి అల్లాయుండాడు. అద్గో వజీర్‌సాహేబు వస్తూయుండార్.

[ప్రవేశము నాజర్‌జంగ్, భద్రాచలము నాయబ్ తహశీల్ దారునొద్దనుండి వచ్చినజాబు చదువుచు.]

**నాజర్‌జంగ్**—ఇదీ, మాకీ, మంచిషంగతి తెలుస్థావుంది. ఇప్డు తెలంగి దివాన్‌లు, పాచ్చాసెల్వు తీస్‌కోకుండా తీర్థంయాత్ర ఎల్లి నార్, అల్ల మాకి తెల్‌సింది. ముజకో, కొంచెంకూడ మాలుంహెూతానహి. ఎనుక, ఇది కాపీర్లమీాద తానీషా వారికి, ఇంత ప్యార్‌కల్గింది? బమ్మన్ మంతుర్లు సుల్తాన్‌వారు దయాగుణం కన్‌పెట్టి, ఏలా పనిసేస్తూ యుండార్! మాది జాతిమన్‌సుల్‌కి బహుత్‌గుస్సాకి సబబ్ కల్గియుంది.

**సేవకుఁడు**—[ప్రవేశించి] ఖుదావిన్, సదర్ అదాలత్ జవాబ్‌నీస్ మీార్ జాఫర్‌జంగ్‌సాహేబ్ స్వారి ఆయాహై.

**నాజర్‌జంగ్**—అచ్ఛా! జల్‌ది ఆనేదే.

[ప్రవేశము మీార్‌జాఫర్‌జంగ్.]

**నాజర్‌జంగ్**—ఆదాబ్, ఆదాబ్, ఆయియే. తష్‌రీఫ్, లేయియే. [జాఫర్‌జంగ్ కూర్చుండును.] భాయ్, ఆజ్, బహుత్, జరూరి ఆగ్‌బర్ వచ్చివుండింది. దీన్నిగురించి మీారు ష్వయం సద్వాలాగాని, మాకీ చెప్పేది, బిల్‌కుల్ మంచిదిగాదు. హల్లా వారికటాచ్చంవల్ల, బమ్మన్‌దివాన్‌లుకు పకడ్‌బంద్ సేసేందుకు మంచి వఖత్ ఆగయాహై.

**జాఫర్‌జంగ్**—ఏమ్‌టి భాయ్, భలేమాట సెప్పార్. మాకి అబి తెల్సింది. హిందుమంతుర్లు, ఖహాతోగయా? [జాబు చదువుకొనును.]

**నాజర్‌జంగ్**—పహిలే దీన్ని సదవండి. భద్రాశలంనుండి ఒక్‌టి మన్‌షి బమ్మన్‌ఖూడా యిక్డా వొచ్చింది. అది మన్ని హుజూర్‌వారి దగ్ర సాక్ష్యం చెప్తుతుంది. మేము ఇప్డు బమ్మన్‌మన్‌సికి అడ్గినాం. తయార్ సెప్పినాడు. బమ్మన్ గిమ్మన్, భాగయూఖైతే మన్కి ఏమి, మర్గయూఖైతే మన్కి ఏమి?

**జాఫర్‌జంగ్**--[ఆశ్చర్యముతో] ఆలాగా! హరే అల్లా! ఇది బమ్మన్ ఎంత కందర్గాపని సేసింది. హుజూర్‌కా పైసా, రాయి దేండుకు ఘుడీకి ఖర్చుసేసింది. అరే, ఏంది ఈడిది సాహాసం. గుండెల్ తీసిన మన్‌సి వుండాడు.

**నాజర్‌జంగ్**—అరే భాయ్! ఇది తహశీల్, కోన్ హైకీ మీకీ తెల్సునా?

**జాఫర్‌జంగ్**--మాలుంనహి భాయ్. ఎవడు మన్ని?

**నాజర్‌జంగ్**—అక్కన్న మాదన్న మంతుర్లు హకాక్ సెల్లెల్‌కి ఖొడుక్. ఆళ్లు యిద్దర్, మన్‌ము లేకుండా సేసి, తానీషావారి సెవ్‌లు కోర్కి, ఈ నమ్మక్‌హరాంకు తహశీల్‌పని ఏసియుండార్. బహుత్, ఖరాబ్, కాం, కియాహై. అబ్బినే అబి, ఆడ్కి పక్డోసేసి, బందిఖానామే, మకాంసేయించాలా. అది షరిగాని, అక్కన్న మాదన్న, ఎక్డ ఎల్లినార్ తెల్సునా? గంగా, గోదావరి, కుసన్‌బేని, ఇల్గా తీర్థంలన్ని మున్గి మున్గి, ఏత్తర్‌లన్ని నూసి నూసి, ఆళ్ల రాయిధేండు, కోతిధేండు, కుత్తాధేండు అందర్కి పూజా గీజా సేసిరావ్‌తానికి ఎల్లినార్.

**జాఫర్‌జంగ్**—మంచి వఖత్ వుండింది ఇప్డు. బహుత్ అచ్ఛా! బహుత్ అచ్ఛా! భాయ్ సాహేబ్, ఇస్‌రోజ్ హల్లాకో యింకా ఒక్‌టి రెండు దఫాల్ మన్ము జాస్తి నమాజ్ చేయ్‌వాలా. తెలంగి మంతుర్లు, ధూరంపోయి ఉండే షంయంలో, ధాసీల్ గోపన్న సర్కారికి పైకం దగాసేసాడు. ఆడు మన్‌సి, అక్కన్న మాదన్నాకు హకాక్‌కొడుక్ షంగతి మనం నైజాంవార్కి మంచి

వఖత్ లో సెవ్ లో మెయ్యాలా. అప్డు సూడు, ఏలాగా తమా సా వుంటుంది.

నాజర్ జంగ్—మాది బుద్ధి, మీది బుద్ధి, ఒక్ టి య్యెందిభాయ్. మీరు రావటాన్కి ముందు మేముఖూడా, ఆలాగే తలశాము. ఈళ్లు మంతుర్లు ఇద్దర్, థానీల్ గోపన్న, లోపాయ్ కారి సేసి, భద్రా శలంతాలూకా ఖజానా, సబ్ తినియేసివార్ అని మన్ము సెప్పేతో, మన్ము తల్సిందిలాగా తానీషావార్ సేస్తార్. హిందు దివాన్లుకు దర్శన్ బంద్ అవుతుంది. ఖైద్ మే బిచానా అవు తుంది. అప్డు రియాసత్ అంతా, మంది మాటమీద నడు స్తుంది. ఇది షంగతి, ఖుదా మెహర్ వల్ల జరిగిందితో, ఒక్టి కొత్తమజీద్ నాకి కట్టిస్తాన్.

జాఫర్ జంగ్—బహుత్ అచ్చా! ఇది వుత్తరం, హుజూర్కి దాఖిల్ సేసి, షంగత్ చెప్పేతో, మన్ మీద బిల్ కుల్ అన్ మానం కల్గు తుంది లేదు.

నాజర్ జంగ్—అది సరి. అప్డు సర్కార్ వారు తెలంగిదివాన్లుకు బులావ్ అంటార్. తెలంగిదివాన్లు గైర్ హాజర్. అది మాట తెలు స్తుంది. అప్డు అది, అగ్గిమీాద గుగ్గిలం, అవుతుంది భాయ్.

జాఫర్ జంగ్—వహ్వా! వహ్వా! ఒక్ దాన్కి ఒక్ టి బాగా కుదిరింది భాయ్. బమ్మన్ మంతుర్లాకి పారబ్ధం బదలైవుంది. ఆళ్ కి శనీ గాడు పట్టివుండాడు.

నాజర్ జంగ్—మన్కు అధరోష్టం పట్టియుండాయ్. ఒక్ డు పోతేగాని, ఒక్ డు ఏలాగా బాగుపడ్తాడు భాయ్. బమ్మన్ కా హోగయా ముసల్ మాన్ కా ఆగయా! కాదు భాయ్?

జాఫర్ జంగ్—ఔను భాయ్! లేక్పోతేతో, ఇందులో మనం ఏంటి అన్యా యం సేస్తూయుండామ్ క్యా? ఖుదా సూస్తావుండార్ కాదు. ఆళ్కి ద్రోహం సేసారు, అన్ భోగం సేస్తారు. మన్కి ఏం సేయాలా?

**జాఫర్ జంగ్**—బహుత్ అచ్ఛా! నాకు అదాలత్ కచ్చేరిమే, కొంచెం జరూరి పని యుండాయ్. ఇప్డు మాకి హుకుం ఈవాలా. [లేచును.]

**నాజర్ జంగ్**—[కూడా లేచును.] బహుత్ అచ్ఛా! బహుత్ అచ్ఛా! మన్కి తెలంగిదివాన్‌లమీాద, ఘుస్సా వుంది. అన్‌మానం హుజూర్కు కొంచెంకూడ కల్గకూడదు. ఆదాబ్, ఆదాబ్. [అని ఇరువురు వెళ్లుదురు.]

[తెర వ్రాలును]

## నాల్గవ అంకము - రెండవ రంగము

గోలకొండ - తానీషామందిరమునందలి కొలువుకూటము.

**తానీషా**—[ఒక మహజరును చేతనుంచుకొని ఆలోచనచేయుచు] రాజ్యాంగమునందలి కష్టములు రాజులకు తెలియవచ్చునే కాని ప్రజలకు సామాన్యముగా తెలియరావు. అందునను ప్రజలలో భిన్నమతములవా రుండినచో రాజుల కష్టములు మఱింత మిక్కుటముగా నుండును. అక్కన్న మాదన్నగార్లు ముఖ్యమంత్రులుగా నుండుట, మహమ్మదీయప్రజలకు కొంద ఱికి సమ్మతముగాలేదని ఈమహజరువల్ల తెలియవచ్చుచున్నది. అయినను అక్కన్న మాదన్నగార్లవంటి యుదారపురుషులను నేనిదివఱకు కని విని యుండలేదు. వారు రాజభక్తిపరాయణులు, స్వామికార్యధురంధరులు, వ్యవహారదక్షులు. కాన వారిపై నిందమోపుటకు కారణము తెలియకున్నది. ఏది యెట్లుండి నను, రాజ్యమునందలి అన్నిమతములవారిని సమదృష్టితోఁ జూచుటయే నాకు కర్తవ్యము.

[సేవకుఁడు ప్రవేశించును]

**సేవకుఁడు** - హుజూర్! ద్వారమున వజీర్ నాజర్ జంగ్ సాహేబు తమ దర్శనార్థము వేచియున్నారు.

తానీషా — ప్రవేశ పెట్టుము. [నాజర్ జంగ్ ప్రవేశించి, తానీషాకు సలాములు చేయును.]

తానీషా — వజీర్! రాజకీయ కార్యములన్నియు క్రమముగా జరుగుచున్నవా? అక్కన్న మాదన్నగార్లు తీర్థయాత్రనుండి మఱలి వచ్చుదనుక కార్యక్రమములయందు నే లోటును నుండఁగూడదు.

నాజర్ జంగ్ — చిత్తము హుజూర్! అయినను దేవరవారు అనుమతిచ్చినచో, నొక విన్నపము చేయఁగోరెదను.

తానీషా — ఏమది? శీఘ్రముగా చెప్పుము.

నాజర్ జంగ్ — ధనాగారమున, ధనము కొఱఁతగానున్నది. భద్రాచలము తాలూకా శిస్తు, బాకీపడియున్నది. అచ్చటి ప్రజలు, ఏలినవారికి నొక విజ్ఞప్తి పంపియున్నారు. ఇందు కొన్ని ముఖ్యవిషయములు కలవుగాన ఏలినవారు స్వయముగా చిత్తగింపవేఁడెదను. [అని జాబు చేతి కిచ్చును.]

తానీషా — [చదివి] ఏమేమి! ఎంతసాహసము! ఈ గోపన్న ఆఱులక్షల రూపాయలను హరించెనే? ఇతఁ డెవఁడు?

నాజర్ జంగ్ — గోపన్న, అక్కన్న మాదన్న గార్లకు మేనల్లుఁడు. వారే, ఏలినవారికి విన్నవించి, తమ మేనల్లునికి తహశీల్ దారీపదవి నిప్పించిరి. వారందఱును జేరి, ఈ రీతిగ నాఱులక్షలరూపాయలు హరించియున్నారు.

తానీషా — ఇతఁడు ముఖ్యమంత్రులమేనల్లుఁడా? వారీసంగతి నాతో నెన్నఁడును జెప్పినట్లుగ నాకు జ్ఞప్తిలేదు. అది యథార్థమైన నట్టియుత్తముల మేనల్లుఁడగు నతఁ డిట్టియన్యాయమున కెట్టులొడిగట్టును? ఇది నిజమో కాదో విచారింపఁదగును.

నాజర్ జంగ్ — హుజూర్! ఈ విజ్ఞప్తిపత్రమున సంతకము చేసినవారిలో ప్రభుత్వోద్యోగులుగూడ నున్నారు. తహశీల్ దారుతో సమానుఁడగు నాయబ్ తహశీల్ దారే మొట్టమొదట సంతకముచేసెను. కాన, నిది యసత్య మని చెప్ప వీలులేదు,

గోపన్న యీ యాజులక్షలను వ్యయపఱచి హిందువుల దేవుఁడగు రామునకు, భద్రాచలమున దేవాలయము కట్టించె ననియు, దీనినిగూర్చి గోపన్న నడిగినను, నిజమనియే చెప్పెద రనియుఁ గూడ వా రీవిజ్ఞప్తియందు వ్రాసియున్నారు. అంతే కాక, భద్రాచలము తహశీల్ దార్ కచ్చేరిలో ప్రముఖుఁడగు నొకయుద్యోగిని, రామశాస్త్రి యను బ్రాహ్మణునిగూడ నిచటికిఁ బంపియున్నారు. అతఁడు నేఁ డీస్థానమునకు వచ్చియున్నాఁడు. దేవర యాతనిఁ బ్రశ్నించినచో సర్వమును విన్నవించును.

తానీషా—అతఁ డెవఁడు? ఎచట నున్నాఁడు?

నాజర్ జంగ్—ఎవరక్కడ? ఆ రామశాస్త్రి యను బ్రాహ్మణు నిట గొని రండు.

సేవకుఁడు—బహుత్ ఖూబ్ [బైటికి వెళ్లి రామశాస్త్రితో మరలివచ్చును. రామశాస్త్రి తానీషాకు సలాములు పెట్టును.]

తానీషా—ఓయీ! నీవు నిజముపలుకుము. కల్లమాట లాడిన కఠిన శిక్షకుఁ బాల్పడెదవు. రాజకోశమునుండి, ఆఱులక్షల ధనమును హరించి, తాలూకా తహశీల్ దారు గోపన్న భద్రాచలమున రామునికి దేవళము గట్టించినది నిజమా?

రామశాస్త్రి—నిజమే మహాప్రభూ! నేను తహశీల్ గోపన్నగారి ఆజ్ఞప్రకారము ఆ పని యంతా స్వయముగాఁ జేయించినాను. నా చేతిమీఁదుగానే, ఆ సొమ్మంతయుఁ గర్చుపడినది. ఇందులో ఏమీ అబద్ధములేదు. గోపన్నగారుకూడ ఖర్చు చేయ లేదని చెప్పరు. ఏలినవారి చిత్తము.

తానీషా—ఏమీ! గోపన్న, తానీషా నంతచులుకనగాఁ దలఁచెనుగా?

రామశాస్త్రి—స్వామీ! తానీషావారిపైని రాముఁ డున్నాఁడు. తన కేమియును భయము లేదని గోపన్నగారి తాత్పర్యము. మఱియు గోపన్నగారు నుడివినవాక్యములు దమయెదుటఁ జెప్పఁట భావ్యము గాదు.

తానీషా—నీ కెట్టి సంశయమును బనిలేదు. నిజము తెలుపుము.

రామశాస్త్రి—"తానీషా ప్రద్యుమా! ఇది తానీషాతాత ముల్లెయా? మన పెద్దలు సంపాదించిన ధనమును, మనము ఏవిధమున నైన వారివలన రాఁబట్టుటలో దోష మిసుమంతయును లేదు" అని రామదాసుగారు దఱచుగ మిమ్ముఁ దూలనాడు చుండు వారు. మఱియు—

తానీషా—[అడ్డపడుచు] ఇఁక నీ వేమియును జెప్పఁబనిలేదు. నీవు పోవచ్చును. [రామశాస్త్రి సలాములుపెట్టి పోవును.]

జాఫర్ జంగ్—ఇది అంతయు అక్కన్న మాదన్నగార్లకు చక్కఁగఁ దెలి యును. సందేహము లేదు.

నాజర్ జంగ్—ప్రభువరా! ఇట్టిద్రోహులను మన ముపేక్షించినచో, ప్రభువులు తమ్ము శిక్షింపరని తలంచి, యుద్యోగస్థులందఱును గూడ యథేచ్ఛగా ప్రభువిత్తమును హరింప నారంభింతురు. అట్లు జరగినచో, ధనాగారములు శూన్యములగును. ప్రభు త్వము జరుగుట కష్టమగును. అక్కన్న మాదన్నలు వెళ్లు సరికే ధనము కొఱవడియుండెను. ఈ గోపన్నను, కారా గృహమున బంధించినచో, ద్రవ్యము లభింపఁగలదు. ఏల యన, అక్కన్న మాదన్న లమాత్యులుగ నుండి, అమితమగు ధనము నార్జించియున్నారు. వారు వెంటనే యాఱులక్షలను సమర్పించి గోపన్నను విడిపించుటకుఁ బ్రయత్నింతురు.

తానీషా—ముఖ్యమంత్రు లని మేము వారియందు సంపూర్ణవిశ్వాస ముంచినందులకు, వారు మమ్ము నిట్లు మోసగించిరి. ఇది వారలకుఁ దెలియకుండునదిగాదు. వారియం దిదివఱ కెంతటి పూజ్యభావ ముండెడిదో, ఇపు డంతతీవ్రనిరసనభావము గలిగినది. వేఱుయోజన లేల? తత్క్షణ మాగోపన్నను పట్టు కొనిరా భటులను బంపుటయే కర్తవ్యము.

నాజర్ జంగ్—స్వామీ! ప్రభుత్వముమేలు గోరియే నే నిట్లు విన్నవించి తిని. ప్రభువు కరుణాళుఁడయ్యు, ద్రోహులపట్లఁ గాఠిన్య

మునే చూపవలయును. లేకున్న, కుత్సితులు సాధుజనుల బాధింతురు. ప్రభుత్వాధికారము బలహీన మగును.

తానీషా—నీవు చెప్పునది సత్యము. తత్క్షణమే ఆజ్ఞాపత్రమును వ్రాసి పంపి, ఆ రాజద్రోహి నిటకు రావింపుము. [అని, సింహాసనమునుండి దిగిపోవును.]

(తెర వ్రాలును)

---

## నాల్గవ అంకము - మూఁడవ రంగము.

భద్రాచలము – తాలూకాకచ్చేరి. రామదాసు, శిరస్థాదారు, గుమాస్తాలు మున్నగు నుద్యోగస్థులు.

రామదాసు—[రామస్మరణ గావించి] శిరస్థాగారు! నేఁ డవసరముగాఁ జూడఁదగినకార్యము లేవైనఁ గలవా? సంతకముచేయవలసిన కాగితము లేవైన నుండిన తెండు.

శిరస్థా.—[కొన్ని కాగితములు అందిచ్చును] నేఁ డింతకన్న ముఖ్య విషయము లేవియును లేవు. [రామదాసు చేవ్రాలుచేసి మరల నిచ్చును.]

రామదాసు—లెక్కలన్నియు సరిగా నుంచితిరా? రామదేవుని యాలయగోపురాదుల నిర్మాణమున కైన లెక్కలు ప్రత్యేకముగ నున్నవిగదా?

శిరస్థా.—అన్ని లెక్కలును సిద్ధముగా నున్నవి. రామదేవుని దేవాలయపుఁబని పూర్తియగుటచే, ఆ లెక్కలును బూర్తిచేసితిని. అందులకు సర్కారు ఖజానాలోనుండి, ఆఱులక్షల పైకము వెచ్చింపఁబడినది.

రామదాసు—ఆఱులక్షలైనవా? రామునికటాక్ష మున్న, ఆఱులక్షలైన నేమి, అఱువదిలక్షలైననేమి? [తనలో] మామగారియొద్దనుండి నా కుత్తరమే రాలేదు. కారణమే తెలియలేదు. తానీషాగారు అనుమతింపకున్న, వారు వెంటనే పైకముఁ బంపియుండరా? భద్రాద్రీశునికటాక్షమున్న సర్వమును భద్ర మగు నని యే నేను దలంచెదను.

[ప్రవేశము - సేవకుఁడు.]

సేవకుఁడు — మహాప్రభూ! గోలకొండనుండి, జవానులిద్దఱు వచ్చి యున్నారు. మిమ్ము జరూరుగాఁ జూడఁగోరుచున్నారు.

రామదాసు — (తనలో) ఏమిది? ఎడమకన్నదరుచున్నది? (ప్రకాశముగ) రానిమ్ము. అన్నిటికి రాముఁడే కలఁడు.

[ప్రవేశము - గోలకొండనుండి ఇద్దఱు తురకజవానులు — [రహీం, ఉస్మాన్.]

రహీం గోపన్నగారు! సలాములు. అయ్యా! మీరు తానీషావారి పైకము హరించినందులకై, మిమ్ము వారికడకు పైకమును చెల్లించుటకై కొంపోఁదలంచి వచ్చియున్నారము.

అనుబంధము 11.

ఇదిగో హుజూరువారి హుకుము. [హుకుము చేతికిచ్చును.] మీరు ఆఱులక్షల్ పైకం, ఈ చ్ఛణంలో శెల్లించకపోతే, మీకి ఇప్డు ఖైదుసేసి, ఇసీ అవ్ గోల్కొండ తీస్కాని పోవాలావచ్చినాం. ఏమీ శెప్తార్?

రామదాసు—[హుకుం చదువుకొని] హా! శ్రీరామచంద్రా!

ఉ॥ నమ్మితి రామచంద్ర! మది నమ్మితి రాజకులేంద్ర! మేలుగా
నమ్మితిఁ గీర్తిసాంద్ర! కడు నమ్మితి దాసచకోరచంద్ర! నా
నమ్మిక లేమి చేసెదవొ నమ్మఁగ నర్హులు గానివారల
న్నమ్మ నయా! దయాబ్ధి వని నమ్మితి ని న్నది జానకీపతీ!

అయ్యలారా! తానీషాగారి యనుమతిఁ బడయకుండ వారి విత్తమును శ్రీరామదేవుని కైంకర్యమునకు నేను వ్యయపఱచినందులకు, ఈ యాజ్ఞ చేయఁబడిన దని యీ పత్రమున వ్రాయఁబడినది. ఆఱులక్షల పైకము నేనెట్లియ్యఁగలను? అది శ్రీరాములవారు చెల్లింపవలసినదేకాని, నావలన సాధ్యమా? అయినను ఒక్కసంగతి తెలుపు మిమ్ము వేఁడెదను. ఈ యాజ్ఞాపత్రము, మీకు మహామంత్రు లగు అక్కన్న మాదన్నగార్ల సమక్షమునసే యియ్యఁబడినదా?

ఉస్మాన్—తెలంగిమంత్రుల్ దేషంలో లేరు. తీర్థంజాత్ర ఎక్కడో కెల్లినార్. ఆరిమీఁదకూడా తానీషావారికి బహుత్ కోపం వచ్చియుండాది. మీ షందేహాలతో మాకు జరూర్ నహి. తచ్చణం రాక్ పోతే మిమ్ము లాక్కొనిపోదుము. [అని లాగి, చేతులకు అరదండలు వేయుదురు।

అనుబంధము 12.

శిరస్థా. మొదలగువారు—ఏమి కావరము? మహానుభావులగు రామదాసుగారెక్కడ, మీరెక్కడ? అరదండలు వేయుటకు మీ కింత సాహసమా? మీకు ప్రాణములపై ఆశయున్న దూరము తొలఁగుఁడు.

రహీం—[రోషముతో] అరేబమ్మన్, క్యాకహా! ఖబర్ దార్. ఖబర్ నహికే, హం ముసల్మాన్ హైఁ?

రామదాసు—అయ్యయో, అయ్యలారా! ఇది పాడియా? వారు నిర్దోషులు. మనకును వారికిని స్వామి యగు తానీషాగారి యానతిని వారు నెఱవేర్చుచున్నారు. ఆ యాజ్ఞ మనకుఁగూడ నవశ్యము పాలనీయముగదా? మీ రిట్లేల తొందరపడుచున్నారు? కామక్రోధములు రామభక్తులకు నుండఁదగినవి గావనుట మీరు మఱచితిరా? మీకు నామీఁద నిక్కమగు ప్రేమ గలదేని మీరు వారి నేమియు ననఁగూడదు.

శిరస్థా. మొదలగువారు—అయ్యా, క్షమింపుఁడు. ఎంతకష్టము, ఎంత కష్టము! పరమభాగవతోత్తముని కరములకు అరదండలా భద్రాద్రీశ్వరుఁ డిచ్చుబహుమానము! రామదేవునికరుణకు ఇదియా ప్రత్యక్షఫలము? భక్తవాత్సల్యము బాగుగనే ఫలించినది.

రామదాసు—సోదరులారా! మీ రాయాదిదేవు నేల నిందించెదరు? ఇది ప్రారబ్ధకర్మము. అనుభవింపక తీఱదు. అనుభవమువలననే కాని యిది నశింపదు. నే నిందులకుఁ జింతింపనుగాని, లోకులు నా తలంపు నన్యథా భావింతురేమో యనిమాత్రమే

చింతించుచున్నాను. అయినను ఎవ రెట్లనుకొనిన నాకేమి చింత? నా తండ్రి శ్రీరాముఁడు నిజ మెఱుంగు నని నే నెఱుఁగుదు. అనుగ్రహ ముంచుఁడు. నేను పోయివచ్చెదను. [జవానులవంక తిరిగి] అయ్యా! మనము పోయెడు దారిలోనే నా బస యున్నది. ఈ వార్త నా భార్యకు నెఱిఁగించి వచ్చెదను. అనుమతింతురా?

అనుబంధము 13.

రహీం—సర్కారీ హుకుం లేదు. నీవు పాఱిపోతే మాకు కష్టం వస్తాయి. సరిపద్దు, చలో, చలో. సర్కారీ పైసా రాముడ్కీ కాదా ఇచ్చావు? ఇంకా మీాది రాఘ్ము, ఏమ్మి సేస్తాడో సూసోకీ.

శిరస్థా — మహానుభావా! మీారు ధన్యులు. ఎంతటివారికైన, ఆపదలు తప్పవు కాని, భగవంతుఁడు భక్తుల యాపదల భారమును తానే వహించి, ఆ బాధలు భక్తులకుఁ గలుగకుండఁజేయు నని పెద్ద లందురు. తమవంటి మహాత్ముల సాంగత్యమునకు మేము దూరుల మగుట, మాదౌర్భాగ్య మని చింతిల్లు చున్నారము.

డఫే — స్వామి! బిడ్డలవలెఁ బ్రోచుచుంటిరే. ఇఁక మాకెవరు దిక్కు? మమ్ముఁగూడ మీాతో రానిండు. మీా చరణసేవ సేయు చుండెదము.

రామదాసు—అన్నింటికిని, కౌసల్యానందనుఁడే కలఁడు. అతనిసేవను మఱవకుఁడు. నన్ను మఱవుఁడు. ఎట్టిలోపమును లేకుండ, ప్రతిదినము ఏవేళ కావేళ, స్వామికి అధికవైభవముతో నుత్సవకైంకర్యాదులను జరపించుచుండుఁడు. ఈ జవానులు తొందర పడుచున్నారు. నేను పోయివచ్చెదను. ఈ వార్తను నాభార్య కెఱింగింపుఁడు. నాకొఱకై వగఁజెందక, తల్లి సీతమ్మను, తండ్రి రామచంద్రుని అహర్నిశములు సేవించుచుండఁ గోరితి నని తెలుపుఁడు. [అని వీడ్కొని పోవుచు.]

సీ॥ రామకైంకర్యంబు రాజధర్మం బని,
తానీషద్రవ్యంబు దాశరథికి
నాలయాదులకునై యర్పించినాఁడ నే,
నధిపుఁ డానతి నిచ్చు ననుచు నమ్మి
ఆతఁ డొల్లకయున్న, నాధనంబు నొసంగ,
మనవి వ్రాసితి నాదుమాతులులకు
దురదృష్టమున వారు పురమున లేకుండి,
రధిపుఁ డీరీతిగా నాజ్ఞ యిచ్చె
నిదియ భోక్తవ్య మగుట నే మదిని గుందఁ
దండ్రి శ్రీరామచంద్రు పత్పద్మములను
మఱవకుండఁగ వర మియ్య హారి భజింతు
రాముఁడే దాత దైవమ్ము రక్షకుండు.

ఉస్మాన్—చలో, చలో [అని రామదాసును గొనిపోదురు.]

(యవనిక పడును.)

---

## ఐదవ అంకము - మొదటి రంగము

గోలకొండ - తానీషా న్యాయస్థానము. వజీర్లు, హిందూ మంత్రులు, పురజనులు మొదలగువారు ఉచితాసనములపై నధిష్ఠించి యుందురు. తానీషా ప్రవేశించును. అతనిరాక చోపుదారు తెలియఁ బఱచును.

చోపుదారు—అల్లాహెూ అక్‌బర్, ఖుదావంద్, గరీబ్‌పర్‌వర్, పాదుషా నైజాం తానీషా సాహేబ్‌కా, సవారి ఆతాహై. హుషియార్.

[అందఱును లేచి, తానీషాకు సలాములుసేయుదురు. తానీషా సింహాసనమునఁ గూర్చుండును.]

నాజర్‌జంగ్—హుజూరువారి హుకుం ప్రకారము, భద్రాచలము తహశీల్‌దార్, గోపన్నను ఖైదుచేసి తెచ్చియున్నారు. ఇతఁడే గోపన్న. [అని గోపన్నను చూపును.]

**తానీషా**- [తిరిగి చూచును.]

**రామదాసు**—ప్రభూ! తానీషాగారు! వందనములు. దేవరవారి ఆజ్ఞానుసారముగ వచ్చియున్నాను.

**తానీషా**—గోపన్న! నీవు భద్రాచలమున రామునకు దేవాలయము గట్టించినమాట నిజమే?

**రామదాసు**—రాజేంద్రా! ఆ దేవదేవుని ప్రేరేపణచే నే నా పవిత్ర కార్యము నిర్వర్తించితిని.

**తానీషా**—అందులకు ఎంత ధనము వ్యయమైనది?

**రామదాసు**—స్వామీ! ఆఱులక్షలు.

**తానీషా**—ఆఱులక్షలు! ఆ ధన మెట్లు లభించెను?

**రామదాసు**-అది భద్రాచలము తాలూకా శిస్తు వసూలు.

**తానీషా**- ఆ సొమ్ము ఎవరిది?

**రామదాసు**—స్వామీ! సర్కార్ వారిదే.

**తానీషా**—ఎవరియనుమతిని గొని ఆ ధనమును వ్యయపఱచితివి?

**రామదాసు**—రాజచంద్రమా! ఇహపరతారక మగు నీధర్మకార్యము దేవరవారి కవశ్యకర్తవ్యముగాన, తాము నిశ్చయముగ ననుమతింతురని తలఁచియే ఆ ధనమును వ్యయపఱచితిని. మఱియు మీ కీభూమండలంబున హారనీహారరాకాచంద్రసదృశం బగు కీర్తి నార్జించి నింపితిఁగాని వేఱొండు కాదు.

## అనుబంధము 14.

**తానీషా**—ఈ విషయమున మా ప్రతినిధిగా నిన్ను నియమించినవారెవరు? ఒరులసొమ్ము వ్యయపెట్టిన నేటి కీర్తి? మా ముజరా పైకము మా కిప్పించి వేఱుకార్యము చూడుము.

## అనుబంధము 15.

**రామదాసు**—ప్రభూ! దేవరవారి యనుమతిని బడయుఁడనియు, ఏ కారణముననైన తా మట్లనుమతింపనిచో, నావిత్తమును వారే

నాకుఁ బంపవలయుననియు ప్రార్థించుచు ప్రధానమంత్రులును, నా మేనమామలును అగు అక్కన్న మాదన్నగార్లకు లేఖను వ్రాసియుంటిని.

తానీషా—అట్టులా? ప్రధానమంత్రు లేమి ప్రత్యుత్తర మంపిరి?

**రామదాసు**—వారిచెంతనుండి నా కెట్టిప్రత్యుత్తరమును రాలేదు.

తానీషా—అట్టిచో, రాజభీతి యించుకైనను లేక, అధికారమదమున కనులుగానక, మ మ్మించుకైన సరకుసేయకపోతివిగా? ఇందులకు నీ మేనమామలుగూడఁ దోడ్పడిరిగాఁబోలు?

**రామదాసు**—ప్రభూ! ఏల నాపైఁ గోపగించెదరు? నే నేతప్పును జేయలేదు. ఈ విషయమున నా మేనమామలు నిర్దోషులు. నన్నుఁ గన్నతండ్రియగు నా సీతారాముని వేఱుగను, మిమ్ము వేఱుగను నే నెన్నఁడును భావించియుండలేదు. అట్టిచో, దైవసములగు మిమ్ముఁగూర్చి నే నెట్లు మర్యాద నతిక్రమింపఁ గలుగుదును? ఈ వ్యయపఱచిన సొమ్ము, మీ నగరున నొకదిన మాచరించు ఖర్చునకు సరిపోలునే; దీనిచే భద్రాచలంబున శ్రీరామున కాలయంబుఁ గట్టితిఁగాని, వేఱొండు కాదు. క్షమింపుఁడు.

అనుబంధము 16.

తానీషా—ప్రేలకుము. రా జగు నన్ను ప్రాణహీనమైన ఱాతి బొమ్మతోనా సరిపోల్చుట? ఆ ఱాతిబొమ్మకువలెనే నాకుఁ గూడ తెలివితేటలు శూన్యమనియు, నీవెట్లు చేసిననూ జెల్లిపోవుననియుఁ దలఁచితివిగాఁబోలు? నీ వెంతటి సాహసమున కొడిగట్టితివి?

**రామదాసు**—హా రామా! రామా! ప్రభూ! రామునిపాదములు—

తానీషా—ఛీ, వదరకుము. నిన్నిప్పుడే ఈ ఖడ్గమునకు బలియియ్యఁ దగినదికాని, నినుఁబోలు స్వామిద్రోహి నంత సులభముగఁ గడతేర్పఁగూడదు. స్వామి కెఱుక లేక వానిద్రవ్యమును వ్యయ

పెట్టుటకన్న నెక్కుడు పాపంబు కలదె? స్వామిద్రవ్యమును వ్యయపఱచిన నేమిముప్పు గప్పునోయనికూడఁ దలఁపవైతివి కదా?

అనుబంధము 17.

రామదాసు—ప్రభూ! దేహము బుద్బుదప్రాయంబుగాని, స్థిరంబు గాదు. భక్తిపారవశ్యముచే, భద్రాచలరాముఁడే దొరయని నమ్మి చేసితినిగాని వేఱు లేదు.

అనుబంధము 18.

నే నేద్రోహకార్యము నొనరింపలేదు. నే నిర్దోషుఁడను.

తానీషా—ఏమేమి! నిర్దోషుఁడవా, నిర్దోషుఁడవా? అన్నమిడినవాని యింటికిఁ గన్నమువెట్టినద్రోహివి గావా? అట్టి నిన్నెట్టిశిక్షకుఁ బాలుసేయవలెనో యూహింపఁజాలకున్నాను. ధర్మకార్యమఁట! నాయనుమతిఁ గొనక ఆఱులక్షలపైకము వ్యయపఱచి గుడికట్టించెనఁట! వృద్ధిగవ్వ విలువచేయని నీవు ఆఱులక్షలు వ్యయపఱచుటయా? ఇట్టి పరమద్రోహిమొగముఁ జూచుటయుఁ గడుఁ బాతకము. ఆఱులక్షలధనమును గ్రుమ్మరించుటయో, లేక కఠినశిక్షలకుఁ బాత్రుఁడై ప్రాణముల విడుచుటయో తప్ప మార్గాంతరములేదు నీకు. [భటులతో] వీనిఁ గొనిపోయి కారాగారమున బంధించి, కఠినశిక్షలకుఁ బాలుసేసి, దీర్ఘకాలము నవసి నవసి చచ్చునట్లొనరింపుఁడు. కొనిపొండు.

నాజర్‌జంగ్ — ఏలినవారి ఆజ్ఞానుసారమే నెఱవేర్చెదము. ఇప్పుడు గోపన్నను కారాగృహమున కంపుటచే, భద్రాచలమున మఱియొకరిని తహశీల్‌దారుగా నేమింపవలసియున్నది. భద్రాచలమునుండి యిచటకువచ్చి యీ యధార్థస్థితినంతయు వెల్లడించిన రామశాస్త్రి వ్యవహారదక్షుఁడు. కొన్ని సంవత్సరములనుండి యచటనే ముఖ్యోద్యోగిగా నుండుటచే, వ్యవ

హారమంతయు బాగుగ నెఱిఁగియున్నాఁడు. కాన, నతనిని తహశీల్దారుగా నియమింపఁదగునని విన్నవించుచున్నాను.

జాఫర్‌జంగ్—వాస్తవము, వాస్తవము. అతఁడు చాల యోగ్యుఁడు.

తానీషా—అటులే కావింపుఁడు. [అని సింహాసనమునుండి దిగి పోవును.]

రామదాసు—హా, రామచంద్రా! నీసంకల్పములేక యేకార్యమును జరగదు. కానిమ్ము. సర్వమును, నీవు నామేలునకే చేయుచుందువు. ఇది నిశ్చయము.

శా॥ పోకన్మానదు దేహ మేవిధమున న్బోషించి రక్షించినన్
రాకన్మానవు హానివృద్ధులు మహారణ్యంబులో డాఁగినన్
కాకన్మానవు పూర్వజన్మకృతముల్ గాఁగల్గుకార్యంబులన్
లేకన్మాన వ వెంతజాలిపడినన్ లేముల్ సిరుల్ రాఘవా!

కార్కానూ—చలో, చలో. (రామదాసును పట్టుకొని పోదురు.)

(యవనిక పడును)

---

## ఐదవ అంకము - రెండవ రంగము

భద్రాచలము - తహశీల్దారు రామశాస్త్రి గృహము.

వీరమ్మ—ఏమోయి, డఫేదారు, నీకు బొత్తిగా బుద్ధిలేకున్నది. కోవెల యమీనును పిలిపించుమని ఎన్నితూరులు చెప్పితిని. వారల కంత పొగరు పట్టియున్నది. ఇది గోపన్నగారి గుడ్డితహశీల్దారీ యని యనుకొన్నారేమో?

డఫేదారు—అమ్మా, అమ్మా; నావల్ల ఏమి తప్పులేదమ్మా! నేను వెళ్లి తమ సెలవైనదని చెప్పినాను. గుడిలో ఏవో ఉత్సవాలంట. ఆతనిచుట్టును వందలువందలుగా జనాలు మూఁగియున్నారమ్మా. ఇప్పుడే వచ్చెదనని మనవిచేయు మన్నారండి. అదిగో, వచ్చుచునేయున్నారు.

వీరమ్మ—రాకపోతే ఎట్లుఁగడా? గోపన్న భార్య నోరుచచ్చిన మనిషి. ఇద్దఱికి ఇద్దఱే అయిపోయినారు. ఒక్కరు మాట లెక్క సేయడములేదు. కాని, నాయొద్ద ఈలాటి ఆటలు సాగవు. [అమీనువైపునఁ జూచుచు] ఏమయ్యా! ఏజామైనది కబురు పంపించి; వెంటనే రావలెనని తెలియదా?

అమీను—[భయభక్తులతో] ఉత్సవాలరోజులమ్మా. ఊపిరి సలపడము నకుఁగూడ వీలులేదమ్మా. క్షమించవలయు. కొంచెము ఆలస్యమైనది.

వీరమ్మ—ఏపూఁటకాపూఁట దేవునికి నివేదనకాఁగానే వేఁడిచల్లారకుండ, స్వామిప్రసాదములు పంపుమంటే పంపక పోగరుపోతుతన ముగా నున్నది. ఆ పరిచారకులకు గట్టిగా బుద్ధి చెప్పుఁడు. లేకపోయిన వారి నౌకరీలకే నీళ్లు వదలుకొని పోవలసి వచ్చును.

[ప్రవేశము - రామశాస్త్రి]

రామశాస్త్రి—ఏమిటిది, ఏమిటిది! ఏమి చాల గడబిడచేయుచున్నావు? [అమీనువంక తిరిగి] ఎవరు వారు, అమీనుగారా? ఏమండీ ఈలా వచ్చినారు?

అమీను—అమ్మగారి సెలవైతే వచ్చినాను.

రామశాస్త్రి—[భార్యతో] ఆతనిమీఁదేనా కోపపడుతున్నావు?

వీరమ్మ—ఆతఁడేమిటి, ఈతఁడేమిటి? సరిగనుండకపోతే, మీకుఁగూడ బుద్ధి చెప్పవలసినదే. పోనిందుకాని [అమీనువంక చూచుచు] సరే, మీరు వెళ్లుఁడు. ప్రసాదము సరిగా పంపు మని చెప్పుఁడు.

ను—చిత్తము. [పోవును.]

రామశాస్త్రి—అప్పుడే ఆరంభించినావా అల్లరి! తహశీల్‌దారీ నీవే చేయుచున్నట్లున్నదే. బాగుబాగు. అమీను నెదుటఁబెట్టి కొని, నాకుఁగూడ బుద్ధిచెప్పెద నంటివి. ఈలాగున నయినఁ ప్రజలలో చాల ఇబ్బంది కలుగును సుమా!

వీరమ్మ—నే నుండఁగా ఏమియు భయములేదు. మీరు నామాటకు అడ్డు చెప్పకుఁడు. వీరి నందఱిని ఏలాగు లోఁగఁదీసెదనో చూచుచుండుఁడు.

రామశాస్త్రి—సరే, నీయిష్టము. నేఁ జెప్పునది నీ వేనాఁడైన విందువు గనుకనా?

వీరమ్మ—చాలు లెండు. మఱి నేఁ జెప్పకుంటే మీరు తహాశీల్దారీ అయ్యేదే! సరే, ఆ గొడవ కేమి? గోదావరిస్నానమునకు వెళ్లవలెను, పాలకీ దెమ్మని చెప్పుఁడు. పంౘ్రెండుగురు బోయీలను, ఇద్దఱు బిళ్లబంట్రోతులను తీసికొనిరమ్మని, ఆ డఫేదారున్నాఁడేమో పంపుఁడు. నే నింతలో వెండిచెంబు పట్టుకొని వచ్చెదను.

రామశాస్త్రి—సరేకాని, మా తల్లిగారినికూడ పిలుచుకొనిపొమ్ము.

వీరమ్మ—ఏమి? ఆ ముసలిబడుగును మీరే పిలుచుకొనిపొండు, నా వలనఁ గాదు. [పోవును.]

రామశాస్త్రి ఆరంభములోనే దీని వ్యవహార మీలాగున నున్నదే, ముందు ముం దేమౌనో? నడుమ నాకు వచ్చినది చిక్కు. ఇంటిలో దీనితో పోరు, ఊరిలో ప్రజలతో రచ్చ. బిడ్డలఁ గలవాఁడనుగూడ. ఏమిచేయుదును? అనుభవింపవలయు; అంతే. ఎవరోయి అక్కడ? [డఫేదారు వచ్చును.] అమ్మగారు గోదావరికి వెళ్లుతారఁట, పంౘ్రెండుగురు బోయీలను, ఇద్దఱు బిళ్లబంట్రోతులను పిలుచుకొని రా. పాలకీ తెప్పించు. ఏమి! భద్రము.

డఫే.—చిత్తము బాబు, చిత్తము.

(నిష్క్రమింతురు)

---

*

## ఐదవ అంకము - మూఁడవ రంగము

గోలకొండ-చెఱసాల. రామదాసు చెఱసాలయం దుండును. ఇద్దఱు భటులు బయట కావలియుందురు.

రామదాసు -

శా॥ నిన్ను న్నమ్మినరీతి నమ్మ నొరులన్ నీకన్న నా కెన్న లే
రన్న ల్దమ్ములు తల్లిదండ్రులు గురుం డాపత్సహాయుండ, వీ
వన్నా! యెన్నఁడు నన్ను సంసృతివికారాంభోధి దాఁటించి, య
చ్ఛిన్నానందసుఖాబ్ధిఁ దేల్చెదో కదే, శ్రీజానకీవల్లభా!

అనుబంధము 19.

తండ్రీ, కరుణానిధీ! నేను పాపినగుటచేఁ గరుణింపకున్నావా? తొలిజన్మమున, నేను ఘోరపాపములను జేసినవాఁడనే యగుదును గాక. ఎయ్యది పరమపవిత్రమో, ఏయది సమస్త పాపపటల విధ్వంసన ప్రవీణమో, ఎయ్యది యుమామహేశ్వరులకు నిత్యమంత్రమో, అట్టి నీ నామమంత్రమును, నేను నిరంతరము స్మరించుచున్నానే, దాని నుపదేశించి మహనీయుఁడు కబీరుదాసుఁడు నన్నుద్ధరించెనే, ఇంకను నాకు పాపము లెక్కడివి? నీవే న న్నిట్లుపేక్షించిన, నే నెవనివాఁడ నగుదును?

ఉ॥ దీక్ష వహించి నాకొలఁది - దీనుల నెందఱిఁ గాచితో జగ
ద్రక్షక! మున్ను నాద్రుపద - రాజతనూజ దలంచినంతనే
యక్షయమైన వల్వ లిడి - తక్కట! నామొఱ లాలకించి ప్ర
త్యక్షము గా వ దేమిటికి - దాశరథీ! కరుణాపయోనిధీ!

అనుబంధము 20.

రామా - రామా - రామా! లెమ్మా, వేగరమ్మా, దర్శన మిమ్మా, పతితపావనా, నీపాదదాసుఁడ నన్నేలుకొమ్మా - రామా - రామా - రామా.

రహీం—అరే, ఇదేమిరా షైతాన్! ఈడ్కి కొత్త్రమే వసిందిమొదల్, ఒక్టే పీడపట్టింది మన్కు. అరే, రాత్ నహి, దిన్ నహి, నీంద్

నహీ, ఖానానహీ, పీనానహీ. అరే శెవులు సిల్లుల్ పడేలాగ, ఒక్కే రాం, రాం సెప్తాడు. అరే, మాకికూడ నీంద్ లేకుండా సంప్తావ్ భాయ్!

**ఉస్మాన్** — అరే బమ్మన్! ఎందుక్రా గడిబిడి సేస్తాన్? ఎక్డారా వున్నాడు, మీది రామ్డు? సర్కార్ పైకం అంతాతీసి రాతికి రప్పకు ఏసి, నిశ్చాపనంలాగ పనియిస్తే కూటిక్ నీల్ పోస్కాని, ఖైదులోవచ్చి పడ్డావ్. నీకి ఘూచారం యీలాగ వుంది బే. తెల్ వారింది మొదల్, జాం రాత్రిదాక, తన్నుల్, తాపుల్, ఏటుల్, పోటుల్, నీక్కి తగిలిందిసాల్దు? హారే అల్లా! ఈడిక్ ఒళ్లు ఏమి ఒళ్లురా! ఇన్ను ఒళ్లులాగవుంది. ఉఁలేదు, ఆఁలేదు, బాధలేదు, నొప్పిలేదు, అమ్మలేదు, బాబులేదు, ఒక్ టిమాట, పాడుమాట రాం—రాం, సెప్తాడు. అరే నీకీ సలాం శేస్తాము. నీకీ పండ్కోక్ భాయ్, మాకి ఏమి సంప్తావు.

**రామదాసు**—అన్నలారా! అనుగ్రహింపుఁడు. నా తండ్రినామస్మరణ మును విన, మీకుఁ గష్టముగనున్నదా? దానిని మానుమను చున్నారా? అయ్యో! ఎంతవెఱ్ఱివారు మీరు! రామస్మరణ మానిన నాకింక బ్రతుకే లేదే. అది తరణోపాయము. అది శ్రీ మంత్రరాజమే.—

సీ॥ సకలభూతవ్రాత - సంఘవిధ్వంసంబు
రామతారకమంత్ర - రాజ మరయ
సకలరక్షోవీర - జాలనిర్మూలంబు
రామతారకమంత్ర - రాజ మరయ
సకలపురాణాది - సన్నుతతత్త్వంబు
రామతారకమంత్ర - రాజ మరయ
సకలతీర్థామ్నాయ - సారసంగ్రహవేది
రామతారకమంత్ర - రాజ మరయ
సకలమునిజనచిత్తాబ్జ - సారభృంగ
మైనశ్రీరామనామంబు - ననుదినంబు

స్మరణ గావింపఁ గల్గును - సత్ఫలంబు
రామతారక! దశరథ -రాజతనయ!

రహీం—ఏమి పాగర్ బోత్ మాంట శెప్తావుండావ్. నీకి శాస్తి సేస్తాము సూడు. అదిగో, ఆ బండ నీకి ఈపుమీాద పెట్తాం. నీకి మొయ్యాల. [అని బండను దెచ్చుటకుఁ బోదురు.]

రామదాసు—

తే॥ వరద! మును దాల్చి తీవు గో - వర్ధనగిరి,
నెట్టు లెత్తుదుఁ బాషాణ - మిపుడు నేను,
నీవు సర్వేశ్వరుండవు - నేను నరుఁడ,
నన్ను రక్షింపవయ్య య - నాథనాథ!

[భటులు బండనుదెచ్చి వీఁపుమీాఁద నిడఁబోవుదురు.] అది వారివైపునఁ బడును. తత్క్షణమే యిరువురును—"అరే అరే," అని కూయుచు క్రిందఁబడుదురు.

రహీం—అరే, హాబ్బా! ఎంతదెబ్బ తగ్లిందిరా! ఎవడో పట్టితోశాడురా నాకీ; నీవు తోశావు భాయ్?

ఉస్మాన్—అరే నాకీ నీవు తోశావ్ తల్శానుభాయ్ నేను. మన్కిఏవడు తోశిందిరా మన్ని? అరే ఇది బాపన్వాడి రామ్డు మాయాలా గుందివోయ్.

రహీం—క్యారే బమ్మన్. అరే గుండు బెండు చేసావోయ్? ఎంతబండ మన్ని వున్నావు నీవు. ఇంత గుండెదిట్టంగలమన్ని మాకి ఎక్డ సూడలేదు. రెండు సెవ్లాకి, రెండు మంద్రగబ్బల్ కడ్తాం సూడు. అప్డు నీది రామ్డు ఏంటి సేస్తాడు సూస్తాం మాకి. [మంద్రగబ్బలు దెచ్చుటకుఁ బోదురు.]

రామదాసు—హా! నిర్భరము! నిర్భరము!

గీ॥ రావె; నీమోముఁ జూపవె; - కావరావె;
వృశ్చికపు బాధ కేను స - హింపఁజాల;
జాలి లేదేల? దాసుని - గోల వినవె;
ధరణిజాకామ! సకలబా - ధావిరామ!

## అనుబంధము 21.

[భటులు మంత్రగబ్బలు దెచ్చి చెవులకుఁ గట్టఁబోదురు. బాధ చేత వారే కేకలు వేయుదురు.]

రహీం—అరే ఒళ్లు అంతా హాగ్గిమంటల్, హాగ్గిమంటల్ పుట్టిందిరా!

ఉస్మాన్—అరే, తేల్ ఆడికి గాదు, నాకు కుట్టిందిరా!

రహీం—అరే యీపాడుమన్నికి పట్టిన పీడ, మన్‌కు పానాల్ తీస్తావుంది వోయ్. ఈడికి ఖొరడాలతో కొట్టి, రక్తాల్ రక్తాల్ కారేలాగ సేస్తాం మాకి. [అని భటులు కొరడాలు తేఁబోదురు.]

రామదాసు—

క॥ గొబ్బున రావే శ్రీహరి!
నిబ్బరముగఁ ద్రాటఁ గట్టి నెఱిని బిగింపన్,
దెబ్బల కె ట్లోర్తును నే
నబ్బబ్బా! తాళఁజాల నార్తశరణ్యా!

[భటులు కొరడాలతోఁ గొట్టుదురు.]

## అనుబంధము 22.

హా, రామా - రామా! పట్టాభిరామా! భద్రాద్రిరామా! సీతారామా! శ్రీరామచంద్రా! మాం పాహి, మాం పాహి.

[అని ధ్యానించుచుండును. భటులు క్రింద పడి కొంతసేపటికి లేతురు.]

రహీం—అరే భాయ్! ఈడు నిజంగా షైతాన్ వుండాడు. వాడికి ఒక్‌టి దెబ్బకొడ్తే, నాకి రెండు దెబ్బల్ తగ్లింది భాయ్. తానీషా వారు మనికి పానంతీస్తే తీస్కోని. ఒక్‌టిసారి పానంపోతుంది. ఇక్డ ఆలాగా కాకుండా, ఎంత బాధల్ పడ్‌వల్సివచ్చింది. మన్కి ఒద్దు భాయ్ ఒద్దు. ఈడికి జోలి మన్కి ఒద్దు. అరే బమ్మన్, నీకి మంత్రం తెల్సు. నీకి కొడ్తే నాకి నొప్పి తగుల్తుంది.

**రామదాసు**—అన్నలారా! నాకు రామమంత్రము తప్ప వేఱు తెలియదు. దానిమహిమను జెప్పెద వినుఁడి:—

శ్లో॥ జయతు జయతు మన్త్రం జన్మసాఫల్యమన్త్రం
జననమరణభేదక్లేశవిచ్ఛేదమన్త్రమ్ ।
సకలనిగమమన్త్రం సర్వశాస్త్రైకమన్త్రం
రఘుపతినిజమన్త్రం రామరామేతి మన్త్రమ్॥

**ఉస్మాన్**—అరే బమ్మన్, బస్‌బస్ నీమంత్రం. అరేభాయ్ [యోజన చేసి] ఈడు "రామ్‌రామ్" సెప్తాడు సూశావ్, అది మన్‌లో మాల్‌వి సాహేబులు శపంసేస్తారు అదిమాదిరి శపంవుండాది. ఆడు 'రామ్' సెప్తేతో, అది దెబ్బ మన్‌మీద్కి తిరుగుతాది బే. మన్కు దెబ్బల్ ఒద్దు గిబ్బల్ ఒద్దు. మనంకూడ "రామ్ రామ్" సెప్పి, పండుకొందాం.

**రహీం**-అవును భాయ్! తానీసావార్కి పకం పోతే మన్కు ఏం పోయింది. మంది పానంపోతే మన పిల్లాంబిడ్డల్, గోల్‌గోల్ అంటారు భాయ్. అరే బమ్మన్, సోజావ్, సోజావ్. [అని "రామ్‌రామ్" చెప్పుతూ పండుకొందురు.]

**రామదాసు**—ఆహా! నను నిద్రపొమ్మనుచున్నారే? నా తండ్రికరుణ కలుగునటులు నాకేటి నిదుర, నాకేటి యాఁకలి? ఈ కావలి భటులింకను నేమి బాధలు పెట్టఁ దలఁచియున్నారో? ఓ తల్లీ! జగన్మాతా! నీ పుత్త్రుఁడను గానా? నీకుఁగూడ నాపై ప్రేమలేకపోయెనా? ఇఁక నామొఱ వినువారెవరు? నీవైనను చెప్పరాదా?

ఉ॥ చందురుతోడఁ బుట్టితివి సాగరరాజునకుం ధరిత్రి; నా
చందము రామచంద్రునకు జాలిఁ బడ న్వినిపింపరాదె? నీ
నందనుఁ డిట్లు బాముల ననారతముం గన నాయకానె యో
చందనగంధి! జానకి! లసత్కరుణామతి నన్నుఁ జూడవే.

అనుబంధము 23, 24.

ఇప్పుడైన నీవు నీ పతితో, నన్నుఁగూర్చి విన్నవించి నన్నుఁ గాపాడఁ బంపవేని, నేఁటికి మూఁడవ దివసంబున, విషపాన మొనరించి ప్రాణంబులవీడువాఁడ. హా! రామా-సీతారామా! [అని పరుండును.]

(యవనిక పడును.)

ఐదవ అంకము - నాల్గవ రంగము

భద్రాచలము - శ్రీరాముని దేవళమున నొకగది. శ్రీరాములు, సీతమ్మయు నుయ్యాలపైని గూర్చుండి పాచిక లాడుచుందురు.

సీత—నాథా! ఏమి యీ పరధ్యానము? ఆట ఇట్లు తప్పాడుచున్నా రేమి?

రామ.—దేవీ! నీకు వినఁబడలేదా? మన భక్తుఁడు రామదాసు ఎంతయో మొఱవెట్టుకొనుచున్నాఁడు. ఏమి చేయుటకును వీలు లేకున్నది.

సీత.—[ఆట నిలిపి ఆతురముతో] వీలు లేదా? సృష్టి స్థితి లయకారణ భూతులరగుమీకు నసాధ్య మొకటి గలదా? వినుచున్నారా తురుష్కభటుల దౌర్జన్యవాక్యములు? భక్తుఁ డాబాధలకు నెటులోర్వఁగలఁడు? నేనెటులు సహింపఁగలను? తల్లీ నీవైనను చెప్పరాదా యనుచున్నాఁడు. నాథా! మీరిఁక నాలస్యము చేయరాదు.

పం॥ చెఱ న్వదల్చి రామదాసుచింతఁ దీర్చి ప్రోవుమా
కరంబుతుచ్ఛుఁ డైనతుర్క, గాసిపెట్టుచున్నవాఁ;
డరాతి నన్నుఁ బందిఁజేసినట్టు; లాఱులక్ష లా
వరాలపైక మెట్లు దెచ్చువాఁడు నాథ! వాఁ డిలన్.

అనుబంధము 25.

రామ.—కాపాడకుండుటకు నా కేమి వానిపైఁ బగయా? వాఁడు నా భక్తుఁ డగుటంజేసియే, వాని కాతురుష్కులు గావించుబాధ

లెవ్వియు, సోఁకకుండ నివారించుచున్నాను. పూర్వజన్మకృత మనుభవింపకున్న వాఁడు మోక్షమున కర్హుఁడు కాఁజాలఁడు. అందులకు, నే నింతకాల మాలసింపవలసివచ్చినది. ఇప్పుడు వానికి కర్మవిమోచన మాసన్నమైనది. కాన నీయిచ్ఛాను సారము నీభక్తుని గాపాడెదను. లక్ష్మణా! నీ వొకసారి యిటు రమ్ము.

లక్ష్మణ—అగ్రజా! పాదాభివందన మాచరించుచున్నాను. జానకీదేవీ! నమస్కారము. నన్ను పిలువనంపినపని యేమి?

రామ—మన భక్తుఁడు రామదాసు గోలకొండపట్టణమున, తానీషా కారాగారమున నున్నాఁడు. త్వరలో బంధవిమోచనము కల్గకున్న, విషపానమున నాత్మహత్య చేసికొననున్నాఁడు. తొల్లింటితపమున తానీషా మనదర్శనమున కర్హుఁడైయున్నాఁడు. కావున మన మిరువురము పోయి, ధన మొసఁగునెపమున తానీషాకు దర్శన మొసంగి, రామదాసును చెఱనుండి విడిపింపవలయును. రామమాడలను లెక్కించి యొకమూట గట్టుము. మనము పోవుదము, శీఘ్రముగ రమ్ము.

సీత—

శా॥ అన్నా! లక్ష్మణ! యాలసించెదు సుమా
యార్తావనుల్ రాఘవుల్
చెన్నారంగను భక్తుఁ బ్రోచుటకునై
శీఘ్రంబ వేంచేయుఁడీ
మన్నాథుండును నీవు సాధుజనులన్
మన్నించి రక్షించుచున్
విన్నాణంబుగ వారిదివ్యనుతులన్
వే పొంద నర్హం బగున్.

లక్ష్మణ—తల్లీ! ఇందు మీ రెఱుంగని దేదియునులేదు. అతఁడు తొలిజన్మంబున నొక కీరంబును బంధించె. ఈ జన్మమున ప్రభువిత్తము ధర్మకార్యంబునకైనను, ప్రభువునుమతిఁ గైకొనక

వ్యయపఱచె. అందులకుఁగాను, శిక్ష ననుభవింపక తప్పదు. లేకున్న నత్యంతభక్తుఁడగు రామదాసును, అన్నగారిట్లుపేక్షింతురా? ఇఁక నన్ని బాధలును తీఱఁగలవు. సెలవొసంగుము, పోయివచ్చెదను.

రామ — దేవీ! మేము పోయివత్తుమా? నీ భక్తుఁడు కారాగృహవిముక్తుఁడగుటయేకాక, మరల సంపూర్ణాధికారమున, అచిరకాలముననే, భద్రాద్రికి రాఁగలఁడు.

సీత — నాథా! మీనేర్పు నేనేమని వర్ణింతును. భక్తరక్షాపరతంత్రులయ్యు, నాముచ్చట దీర్చినవారుఁగూడ నగుచున్నారు. ఇట్లే కలకాలము శరణాగతరక్షణ మొనరించి, వారొనర్చు స్తోత్రముల నందుకొందురుగాక యని, వినయపూర్వకముగ వేఁడికొందును. తడయక కడువడిగ, విచ్చేయఁగోరెదను.

మత్త॥ నిన్ను డెందమునందు నెప్పుడు నీరజేక్షణ! నమ్మి యా
పన్నుఁడై వగవంగఁబాడియె ప్రాణనాయక! దాసుఁడున్
బన్నుగాఁ జని వానిఁ బ్రోవుము భక్తవత్సలబిర్దు నీ
కున్నదానికి సార్థకంబుగ నుర్వి సాధులు మెచ్చఁగాన్.

## అనుబంధము 26.

[ తెర వ్రాలును ]

---

### ఆఱవ అంకము - మొదటి రంగము

గోలకొండ - తానీషా శయనగృహము. తానీషా భార్యలతో ముచ్చటలాడుచుండును.

తానీషా — కాంతామణులారా! మీరు నేఁ డెంతయో యుల్లాసము గలిగించుచున్నారు నేఁడు కడు సుదినము.

ఉరు — ప్రాణేశ్వరా! మీరు మాపై నింతటి ప్రేమాతిశయము గలిగి యుండుటచే, మేము ధన్యల మైతిమి.

కృపా — సకలరాజమకుటమాణిక్యదీప్తచరణుల రగు దేవరవారి కూర్మి పొలఁతుల మగు మాకుఁ గాకున్న, మ తెవ్వరికి నధికోల్లాసము?

తానీషా—సుందరీమణులారా! మీమృదుమధురవాక్యములు నా కప రిమితానందముఁ గల్గించెను. ఇట్టి వినోదములచేఁ గాకున్న, నిరంతర రాజకార్య చింతాభరంబున మునింగియుండువారికి సౌఖ్య మెట్లు చేకూఱఁగలదు? మీయట్టిలావణ్యఖనులును, విలాసవతులును, సంగీతసాహిత్యవిద్యాప్రవీణలును లభించుట, నాపూర్వజన్మపుణ్య మని నే నెంతయు సంతసించుచున్నాను.

కృష్ణా—ఇవి మాటలా, మాణిక్యములమూటలా?

గోష.—ప్రాణేశ్వరులు నేఁడు వింతమాట లాడుచున్నారు.

తానీషా—ప్రాణకాంతలారా! ప్రాణేశ్వరీశబ్దము మీయందే సార్థక మగుచున్నది. పూర్వజన్మముగలదని హైందవులందురు. అదియే సత్యమగునేని, నేను పూర్వజన్మమునందు, దేవు నత్యంతభక్తితో నారాధించియుందును లేనిచో నిట్టిపదవియు, ఇట్టి రూపలావణ్యధన్యలగు సతీమణులును నా కెట్లు లభింపఁగలరు? స్వర్గలోకమునందుండురని హైందవులు నుడువురంభోర్వశీమేనకాదులగు నచ్చరమచ్చెకంటులు, మీ కిసుమంతయు నీడుగా రనుటయం దతిశయోక్తి యొక్కింతయును లేదు.

సురు—తా మిట్లు మమ్ముఁ బ్రశంసింపఁగూడదు.

కృష్ణా—తొలిమేనఁ బలునోములను నోఁచియుంటనే, మేము మీచే వరింపఁబడఁగల్గితిమి.

గోష—హైందవులు పేర్కొను కంతు వసంత జయంత నలకూబరాదులసౌందర్యము, ప్రాణేశ్వరులసౌందర్యముముందు పేర్కొనఁబడుటకైన సర్హమా?

తానీషా—ఈ పరస్పరస్తోత్రపాఠములచే వృథాకాలయాపన మేల? సరసగానకళాకోవిద లగు మీ రించుకసేపు, మీగానామృతమున, న న్నానందింపఁజేయుదురుగాక.

[భార్యలు పాటలు పాడుదురు. తానీషా నిద్రించును.]

సురు.—నాథుఁడు గానమును వినుచునే నిద్రాపరవశుఁ డయ్యెను.

గోష —మనము సందడిచేసిన నాథునకు నిద్రాభంగము గలుగును. మనముగూడ పోయి శయనింతము రండు.

[భార్యలు నిదురించుటకు లోనికిఁ బోదురు.]

తానీషా—[నిదురనుండి యులికిపడి లేచి] ఆహా! వీ రెట్లు అంతిపురికి రాఁజాలిరి? కావలిభటు లేమైరి? [అని కన్నులు నులుముకొని చూచి ఆశ్చర్యపడును. ఈ మాటలు విని భార్యలు నిదుర నుండి లేచివత్తురు.]

సురు —నాథా! ఏ మది? ఎవరు వచ్చిరి?

తానీషా —ఇద్దఱు సుందరమూర్తు లిటకు వచ్చి, రామదాసుజవానుల మని నుడివి, బంగారునాణెములఁ గ్రుమ్మరించి పోయిరి. ఆహా! వారిసౌందర్యము, మెం దెన్నఁడుఁ గని విని యెఱుఁగను. వా రెందు పోయిరో గదా?

కృపా —నాథా! ఇ దేమివెఱ్ఱి? పరపురుషు లెవ్వరైన నంతిపురి కెట్లు రానేర్తురు? మీరు కలఁగని యిట్లు పలుకుచుంటిరిగాఁబోలు?

తానీషా— ఇది కల గాదు. నేను కన్నులారఁ జూచితిని. మోహనా కారులగు వారి ముద్దుమోములు నా కెన్నఁటికిని మఱపురావు.

గోష.—[నవ్వుచు] నాథా! శయనింపుఁడు. మీరు ధన్యులరగుదురు గాక. కాననే ఆ సుందరమూర్తులు, మీ కొక్కరికే దర్శన మొసంగి తిరోహితులైరి. ఈ కలను మఱచి నిదురింపుఁడు. [అందఱు మరల నిదురింతురు. రామలక్ష్మణులు పాడుచుఁ బ్రవేశింతురు.]

అనుబంధము 27.

తానీషా—[పాటయనంతరమున లేచి] ఆహా! ఆహా! ఏమి యీదివ్య గానము కర్ణపేయముగా నున్నదే! ఇంత మనోహరముగా, గానమొనరించు ధన్యు లెవ్వరో? [రామలక్ష్మణులు నవ్వుచు నెదుట నిలువఁబడుదురు. తానీషా వారిని ఆశ్చర్యముతోఁ గనును. రామలక్ష్మణులు తానీషాతో సంభాషింతురు.]

## అనుబంధము 28.

లక్ష్మణ—మీ పైకము అణా పైసలతోఁ జెల్లించితిమి. రామదాసు గారు మీకిఁక నొక కాసైన బాకీలేదు. కలము కాగితము లేకున్న, పంచెమీఁదనే, తమ్ములపుటుమ్మితో నద్ది, మోహరు వేసి, మాకు రసీ దిచ్చి పంపుఁడు.

తానీషా—అర్ధరాత్రమునవచ్చి, మీ రిట్లుల ధౌర్త్యము గావించెదరు? మీ రాఱులక్షలను దెచ్చితిరో లేదో దైవమెఱుఁగును. దాని నిపు డెవరు లెక్కింపఁగలరు?

రామ—మే మట్లు మోసగించువారము గాము. త్వరపడుఁడు. మా కొఱకు రామదాసుగారు వేచియుందురు.

మత్త॥ మిమ్ము మోసము చేతు మం చని-మీర లెంచగఁ బాడియే మ మ్మి టాడక ద్రవ్య మంతయు - మానుగన్ గణియింపుఁడీ సమ్మదంబున దాసుఁ జూడఁగ - సత్వరంబుగఁ బోవు మా కిమ్ము ద్రవ్యము చేరినట్లుగ - నిప్పుడే గుఱుతున్ బ్రభూ!

[తానీషా కలఁత నొంది ఏమి చేయఁ దోఁపక రసీదు వ్రాసి యిచ్చును. రామలక్ష్మణులు రసీదు పుచ్చుకొని నిష్క్రమింతురు.]

తానీషా—[జరగినసంగతుల యోజించి యాశ్చర్యపడును. బంగారు మోహరీలను తీసిచూచి రామలక్ష్మణులను వెదకును. వారు కనఁబడరు. సంగతుల నాలోచించి, జరగినదంతయు నిజమని నమ్మి, తన సంతాపమును వెలివఱచును.] ఆహాహా! ఎంత యజ్ఞాని నైతిని! వా రెట్లువచ్చిరి? ఎట్లుపోయిరి? ఇది కల్ల గాదు, యధార్థము. ఈ స్వర్ణముద్రికలఁ గనులారఁజూచుచు, నేనిది స్వప్నమని యెట్లు తలంపఁగలను? ఆహా! ఈ కవాటము బంధింపఁబడియే యున్నదే! వా రెట్లు పోఁగలిగిరి? వారెవ్వరో గదా? ఎటనుండి వచ్చిరో? రామదాసునౌకరుల మనిరి. పాపము! కారాగృహంబునఁబడి యతఁ డలమటించుచుండ నతని కనుచరులెక్కడ? ఆఱులక్షలు వారెటనుండి తేఁగలుగుదురు? వారు నౌకరులు కారనుటయే నిశ్చయము. వారు తమ

పేళ్లనేమని చెప్పిరి? [ఆలోచించి] మొదటివాఁడు - రామోజీ, రెండవవాఁడు - లక్ష్మోజీ. రామోజీ - లక్ష్మోజీ, రామోజీ - లక్ష్మోజీ. ఆహా! తెలిసె తెలిసె. రామలక్ష్మణులు. [పరితపించుచు] ఆ భక్తాగ్రణిని కారాగృహవిముక్తునిఁ జేయ, నతని యిలువేల్పగు, శ్రీరామచంద్రమూర్తియే, సోదరసహితుఁడై, మాయాబాలకవిగ్రహముల నాకు దర్శన మొసంగి, నే నజ్ఞానాంధకారనిమగ్నుఁడ నై, ఇంచుకయు గ్రహింపఁజాలక పోతినే! సర్వవిధంబుల, తన్నే నమ్మి, సర్వస్వమును దనకే సమర్పించి, తనసేవ నొనరించుటకు ఫలితముగ, దాసుఁడు కారాగారమున, నవయుచుంటచే నార్తావనుఁ డీమూర్తిధరించి వచ్చెనే! ఆహా! రామదాసు భక్తివిశేషము. ఆహా! రామచంద్రుని భక్తవాత్సల్యము! అయ్యో! చేఁజిక్కిన చింతామణిని, జాఱవిడిచితినే! మహామోహము కనులఁ గప్పెనే! నాపాలి పెన్నిధానమువలె నేతెంచిన కన్నతండ్రుల నత్యంత భక్తితోఁ నాదరింపక, సేవింపక, పూజింపక, ధ్యానింపక, యర్చింపక, మహాపరాధ మొనరించితిని. భాగవతాపచారమునకుఁ దొడిఁపుడు, భగవదపచారము గూడ నాకుఁ దటస్థించినది. ఏమిగతి?

ఉ॥ వేదన మాయె భాగవత - వేధ యటుండఁగ దేవతాపచా
రోదయ మీయెడం గలిగె - నొప్పుగ సేవలఁ జేయనైతి నే;
స్వోదయమైె కరంబునను - జొచ్చిన మానిక మెట్లుపోయె నం
చాదటనొందె నా మనము, నందఁగనైతిని వారికూటమిన్.

[భార్యలు, మాటలు విని లేచివత్తురు.]

**గురు.**— ప్రాణేశ్వరా! ఇది యేమి మీకు నేఁ డిట్లు పీడకలలు వచ్చుచున్నవి. మరల స్వప్నమా? అల్లావారి నామమును స్మరించినఁ బీడాపరిహార మగును.

**తానీషా**.- బుద్ధివిహీనవై, ఇట్లు మాటాడకుము. స్వప్నముఁ గాదు, గ్రహపీడయుఁ గాదు. సాక్షాజ్జగదీశ్వరసందర్శనమేఁ కలిగినది.

మొదట స్వప్న సందర్శనమును బిమ్మటఁ బ్రత్యక్షసందర్శనమును భగవంతుఁ డొసంగెను. అంతటితోఁ దీరెనా? ధనరాశి నిటు ప్రసరించెను. నాచే రసీదు గొని యంతర్హితుఁ డయ్యెను. మూర్ఖతచే మీరు నన్నుఁ బరిహసించుచుంటిరి.

గోప.—సర్వేశ్వరుఁడు వచ్చెనా? ఎట్లు వచ్చెను? దేవునివలె వచ్చెనా? లేక దయ్యమువలె వచ్చెనా?

కృపా.—తలుపు, లోన గడియ వేయఁబడియేయున్నది. ఎట్లు రాఁగలుగును?

తానీషా—ఓ మందమతులారా! ఎందుల కీవికటోక్తులు? కన్ను లున్నందులకు ఫలముగ నీ మాడలనైన చూడఁజాలరా?

గురు—[సవతులతో] ఈ బంగారునాణెము లెట్లు వచ్చినవోకదా!

కృపా—మనము పండుకొనునపు డిచట నీ ధనరాశి లేదే, ఇపు డెట్లు వచ్చెను?

గోప—అది ఏమో నాకుఁ దెలియదు గాని, దేవుఁడేమి వచ్చుటేమి? మీకుఁగూడ మతిభ్రమ కలుగుచున్నట్లున్నది.

తానీషా—[మాడలఁ బరీక్షించి] హా! రామ - రామ - రామ - రామచంద్ర! ఇఁక నిశ్చయమే. నిస్సంశయమే. భద్రాద్రిరాముఁడే వచ్చెను. ఇవి రామమాడలు. ఇవి యన్నియు నొకరీతినే యున్నయవి. ఇట్టి నాణెములు మన ధనాగారమునం దెచ్చటను లేవు.

పుర—నాథునకు హైందవపిశాచ మావేశించినది.

గోప—అది గాదు. నిజముగా నిది పైత్యభ్రమ. ఆలసింపక వెంటనే వైద్యుల రావింపుఁడు.

తానీషా—ఛీ! ఛీ! నాస్తికురాండ్రా! నన్నుఁ బిచ్చివాఁడ ననుచున్నారా? మతిలేని మీకంటె నేను వేమడుంగులు ధన్యుఁడను. సర్వేశ్వరుఁడు నాకు దర్శన మొసఁగెను. నాతో ముచ్చటించెను. మీరు పాపచిత్తలుగాన నసే, గాఢనిద్ర మునిఁగితిరి. సరి;

పొందు. నే నిప్పుడే కారాగృహమునకుఁ బోయి భక్తాగ్రణి యగు గోపన్నపాదముల నాశ్రయించి కృతార్థుఁడ నయ్యెదను:—

తే॥ కటకటా! నాదు పాపంపుఁ - గలిమిఁ జేసి
నిన్నుఁ గాంచియు గ్రహియింప - నేరనైతి;
దాసునెడ నే నొనర్చిన - దోసములను
సైఁపు మోరామ! నీపదా - శ్రయ మొసంగి.

(నిష్క్రమింతురు)

---

## ఆఱవ అంకము - రెండవ రంగము.

గోలకొండ - కారాగృహము. రామదాసు కారాగృహమం దుండును. భటులు కావలి గాయుచుందురు.

రామదాసు—

ఉ॥ ఎన్నఁటిదాఁక నోర్తు నిఁక నెన్నఁడు నా కనుకూలుఁడ వయ్యెదో
విన్నప మెంత చేసినను వీనులు మూసుకయున్నయట్లు నీ
వున్నది యేమికారణమొ, యొక్కనిమాత్రము నన్నుఁ గావు నీ
కన్నను నాకు దిక్కెవరు గల్గుదు రీయెడ జానకీపతీ!

[నిట్టూర్పుతో] రామా! నీకై ఎన్నికష్టములు పడితి? ఎందఱిని వేఁడితి? ఎందఱిని బతిమాలితి? ఎంతయపనింద పడితి? తుదకు అప్పులపాలైతినిగదా! తానీషావిత్తమును అఱకాసైన, నా కుటుంబమునకు వ్యయపఱచి యెఱుఁగనే? ఏల యిట్టి నిర్దయ? మహదైశ్వర్యసంపన్నుఁడవగు నీ పదవికిఁ దగినరీతిని కైంకర్యములు జరుగకున్న నెట్లనికదా, సర్వోపచారములకుఁ దగిన యేర్పాటులు గావించితి. ఇది యొకయపరాధ మని నీకుఁగూడఁ దోఁచెనా? నీవు తలంచిన స్వర్ణవర్షము గురియింపఁజాలవా? ఈ యాఱులక్ష లనిన నీకుఁ దృణప్రాయము గదా? ఏల రక్షింపవు? ఏల పలుకవు?

చ॥ పిలిచినఁ బల్కవేమి ననుఁ బ్రేమను గన్నులఁ జూడవేమి నేఁ
దలఁచినతప్పు లన్ని మఱి తప్పక చూపెదవేమి యయ్యయో!

పలుమఱు నీవె దిక్కనుచుఁ బట్టితి నీపదపద్మయుగ్మమున్
బలుచఁదనంబుఁజేసి నను బాములఁ బెట్టకు జానకీపతీ!

అనుబంధము 29.

[కొంచెము యోజన నభినయించి వినయముతో] ఆహా! ఇంకను నీకుఁ గరుణ గలుగదాయెఁగా? దిన మొకయేఁడుగఁ గడపెడి తనయునిమీఁద నేల దయఁజూపవు? కటకటా! నీదుసంకల్ప మెట్టిదో కాని, నే నెంతవాఁడను? ఇంతటి క్రూరపరీక్ష యేటికి? దీనులకెల్ల దిక్కు నీవేకదా? సకలలోకములు నీలోన నున్నవనియు, లోకములలో నీవు నున్నాఁడవనియు శ్రుతులు చాటఁగా కర్ణముల కామోద మభివృద్ధియగునట్లు విన్నవాఁడను. ఇట్టివాఁడవు నీవు ప్రోవకున్న నెవరు ప్రోతురు? శరణని, నీమఱుఁగుఁజేరితి సుమా! ఎన్నరాని ప్రేమ నెందు దాఁతు రామా! శరణాగతరక్షణబిరుదాంకుఁడ వనికదా నీచరణంబుల నంటితి. నీసొమ్ము నే ననుట నిజమైనచో, నా దోసములన్నియుఁ దొలఁగింపుమా! రక్షించుదొర వని నిన్నే నమ్మియుండ, శిక్షించుటకు నే నేమితప్పుఁ జేసితిని? నన్ను రక్షించుటకు నీకంటె రాజు లెవరున్నారు? కన్నతండ్రివగు నీకు నను రక్షించుటకుఁ గరుణయేల రాదు? కరి, ప్రహ్లాద, విభీషణాదులను గాచితివని వింటిని. అట్లుండ నన్ను రక్షించుటకు నీకు శక్తి లేదా? నిన్నుఁగాక నే నన్యమెఱుంగను. నీవే నాగతి. కోపముసేయవలదు. పామరుఁడని నను విడువవలదు. నే నపరాధి నైనను క్షమించి రక్షింపుము.

ఉ॥ రాముఁడు రక్షకుండు; రఘురాముని నమ్మినబంట నేను; నా
కేమి భయంబు? చింత లిఁక నేటికి? నేమి ఘటించినన్ రఘు
స్వామిది కీర్తి సత్యమిది సత్యము; నాకుఁ బనేమటంచు నే
నీమహనీయకీర్తి విని ని న్నెద నమ్మితి జానకీపతీ!

[కొంతతడ వాలోచించి - నిర్దాక్షిణ్యముతో] రామా! రామచంద్రా! నా నమ్మికలు వ్యర్థము గావించెదవా? కాపాడ నుపేక్షించుటకు నేఁ జేసిననేరము లేమి చెప్పుము? నావదిన్రెళ్లకు రత్నపుటుంగరములు ని న్నడిగితినా? లేదుగదా! లేక, బంగరుశాలువలు,

పాగాలు, అంగీలు, నడికట్లు మున్నగువానిని గోరితినా? లేదుగదా! కాక, నీ పదముల నమరిన సరిగజ్జెల వేఁడితినా? లేదుగదా! లేక, నీవు చేతధరించిన దానకంకణమును యాచించితినా? లేదుగదా! అట్లుండ నాపై నేల దయరాదు? నీ వేల దర్శనమియ్యవు? నేను మిగులఁ గఠినుఁడను సుమా! ఇదే చెప్పెదను. నా అప్పు దీర్పకున్న నిన్ను విడువను. అడుగు దాఁటనియ్యను. గడియగడియకుఁ దిరిగి తిరిగి యడిగితిని. సారెసారెకు వేఁడి వేసరితిని. ఇఁక, మివ్వుల దుడుకుతనములు సేయుదును. నా హృదయకమలమున, నీదుమృదు పదములను బంధించివేయుదును. ఈ క్షణమున దీనజనుఁ డని నా కోరిక యీడేర్పకున్న, సాక్షిఁ బెట్టి నేఁడు వేఱొకదీక్షచే నిన్ను సాధింతును. ఇఁక, నన్ను మోసము సేయఁజాలవు. నేను మోస పోవను. మురియుచు, నిదురలో నీవు చెప్పినట్టు వినుటకు నే ముచు కుందుఁడను గాను సుమా! నీ యాజ్ఞల కన్నిటికి నౌనని, తల యూఁచుటకు నే నాహనుమంతుఁడనుగాను; బిరబిర నీవలలోఁ బడు టకు నే నావిభీషణుఁడను గాను. కాన, నాఋణము తీర్చి యావల నడుగుదాఁటిపొమ్ము. [కొంతతడ వాలోచించి - అనుమానముతో] ఆహా! తెలిసె, తెలిసె! ఇప్పుడు తెలిసె! అధికుని చేపట్టితినిగదా, అడ్డమేమనుకొంటిని? తుదకు, అధమునికన్నను అన్యాయమైపోతిని. నీవు నిజముగా నారాముఁడవు కావు. అట్లున్న, నన్నిట్లుపేక్షింతువా? మున్నొకనాఁడు కష్టము లనుభవించినరాముఁడు నన్నుఁ గష్టపెట్టుట కియ్యకొనునా? ఱాతిని నాతిగఁ జేసినరాఘవుఁడు, రక్తుఁడగు భక్తునిఁ గాపాడకుండునా? శరధిని బంధించిన సీతారాముఁడు, శరణాగతుని విడనాడునా? గజపతిని బ్రోచినవాఁడు నిజదాసుని బ్రోవకుండునా? [కొంచెము యోజన నభినయించి - వ్యసనముతో] ఏమిది? ఎంత మాటాడితిని! అయ్యో! పరమపాతకుఁడ. నాతండ్రిని కఠినోక్తులాడితినే. ఆతఁడు కరుణాప్రపూర్ణుఁడే! రామా! రామా! మన్నింపుము, రక్షిం పుము. నీకన్న నా కన్యదైవము లెవరున్నారు? నీవే రాముఁడు, నీవే జగదభిరాముఁడు, నీవే జానకీరాముఁడు, నీవే కల్యాణరాముఁడు. నీవుతప్ప నాకు వేఱొక రాముఁడు లేఁడు. రామా! రామా! రక్షిం

రామా! రఘునందనా! రఘునాయకా! రఘుకులతిలకా! [దండకము]
జగన్మోహనాకార; జన్మాదిక్లేశాపనోదా; జగజ్జాలవంద్యాంఘ్రిపద్మాళి
సంక్షోభవద్భూరిసామంతరాజా; శ్రీ తామోదసంధానచాతుర్యధుర్యా;
భవాంభోధిసంతారకా; బంధము ల్బాపి, కారాగృహావాసముం
ద్రోసి, నన్బ్రోవ, నీవేకదా దిక్కు, వేఱెవ్వ రోవంద్యపాదాంబుజా;
భక్తవంద్యా; శరణ్యుండ వీవంచు నిన్ జేరు సుగ్రీవు, సత్రాసు
విత్రాసునిం జేయ, నావాలినింగూల్చి కావంగ దిక్కైతివంచు, న్భవత్పాద
పంకేరుహంబు ల్సదా నమ్మియుంటి; న్భవత్సన్నిధిం జేర్చి కావ న్గడుం
న్వేఁడుచుందున్, భవాంభోధిపోతా - నమస్తే - నమస్తే - నమః.

[అని యొడలుమఱచి క్రిందఁబడును. పిమ్మట రామలక్ష్మణులు ప్రవేశింతురు.]

లక్ష్మణ—అన్నా, రామదాసును చూచితె? గరళమును చెంతనిడికొని పరవశుఁడై పడియున్నాఁడు.

రాముఁడు—

మత్త॥ తాళరా దిఁకఁ దీఱెఁ గష్టము దాసవర్యున కియ్యెడన్
వేళ గా దిటు లాలసింపఁగ వేగ యేగవలెంజుమా
కాలయాపనఁ జేసిన న్మతి గాంచ గోపనవర్యు నీ
వేళఁ దానిష యేగుదెంచును వేగ చూచెదు నేమొకో.

లక్ష్మణా! గరళమును పాఱఁబోసి, మఱి రసీదునందుంచి యరుగుదెమ్ము. [లక్ష్మణుఁడు ఆలాగు చేయును. ఇరువురు నిష్క్రమింతురు.]
రామదాసు—[మూర్ఛనుండి లేచి.]

## అనుబంధము 30.

రామా! నీకు నాపై దయ రాదా? నీవు దర్శన మియ్యవా? నీ వెంతకఠినుఁడవు. అయ్యో! ఎంతమాట లాడితిని. నాతండ్రీ కఠినుఁడా? నవనీతకోమలహృదయుఁడు. నేను పరమపాపిని. అతని దర్శనమునకు నాకు నర్హత లేదు. ఇఁక నా కీబ్రతుకు కేల? ఈ విషమును

గ్రోలెదను. తండ్రీ, రామచంద్రా, ఇదియే కడసారిగ ఈజన్మమున నీస్మరణ సేయుచున్నాను.

శా॥ శ్రీరామా రఘునందనా రఘుపతీ సీతామనోనాయకా
కారుణ్యాభయదానహస్త వరదా కాకుత్స్థవంశోద్భవా
దారిద్ర్యాంధతమిస్రతాపహరణా తత్త్వాబ్ధిచంద్రోదయా
రారా నామదిలో వసించి కృపతో రక్షింపరా మొఱ్ఱ-దన్.

రామా - రామా - రామచంద్రా, రక్షింపుము - రక్షింపుము. [అని విషమును త్రాగఁబోవును. అందు విషము గానక, రసీదునుగని దిగ్భ్రమసెందును] ఏమిది! ఈ పాత్రలోనివిష మేమైనది? ఈ పారాజవానులే దానిని పాఱఁబోసియుందురు. హా! నేనింకను బాధల ననుభవింపవలసియుండఁగా, నాకెట్లు చావువచ్చును? రాము నకు దయలేకపోయిన పోయె, ఓ మృత్యుదేవతా! నీకుఁగూడ దయ లేకపోయెనా? [అని రసీదును మఱలఁజూచి] ఆహా! తానీషాగారి ముద్ర గూడ దీనిపైనున్నదే, ఇది యెట్లువచ్చినది? ఓ మహారాజా, తానీషా! నా కింకను విముక్తి లేదా? హా, దైవమా! నా మేనమామలుగూడ నన్ను మఱచిపోయినారే! (అని పరితపించును.)

[ప్రవేశము - అక్కన్న మాదన్నలు.]

**అక్కన్న**—ఇది యేమో వింతగానున్నది. తానీషాగారు మనల నీ వేకువజామున నేల చెఱసాలయొద్దకు రమ్మని చెప్పి పంపి యుందురు?

**మాదన్న**—అన్నయ్యా! గోపన్నతోపాటు, మనలనుగూడ, నీ చెఱ సాలను త్రోయింతురుగాఁబోలు. ఇదిగో వారే వచ్చు చున్నారు.

[ప్రవేశము - తానీషా ఆతురముతో.]

**తానీషా**—అరే, పహరజవాన్, ఖోల్ దర్వాజా జల్దీ. రామదాస్‌కు, రిహాకరో. [జవానులు తలుపులుదీసి రామదాసును చెఱలో నుండి వెలుపలికిఁ గొనివత్తురు.]

తానీషా—[ఆతురముతో] గోపన్నా! మహానుభావా! రామభక్తాగ్రణీ! నేను మహాపరాధిని. నాకిఁక గతులులేవు. నేను పరమ భాగవతోత్తముఁడవగు నీపట్లను, నీ స్వామిపట్లనుగూడ మహాపచారమును గావించితిని. నన్ను మన్నింపుము.

రామదాసు—[దిగ్భ్రమఁ జెంది] అయ్యా! తానీషాగారు! ఇదేమి వింత మాట లాడుచున్నారు? మీమాటలు నాకేమియుఁ దెలియ వయ్యె.

తానీషా—అయ్యా! నిన్నరాత్రి శ్రీ రామలక్ష్మణులు నా శయనమందిరమున కరుదెంచి, నిదురించుచున్న నన్ను మేలుకొలిపి, యాఱులక్షల పైకమునకును బంగారుమాడలు కుప్పఁబోసి, నాచే రసీదుఁ గొనిపోయిరి.

రామదాసు—ఆఁ! ఏమి, ఏమి? శ్రీ రామలక్ష్మణులా! మీకు దర్శన మిచ్చిరా! ఎంతటి పుణ్యాత్ములు మీరు!

అనుబంధము 31.

అయ్యా! తానీషాగారు, మీరు ధన్యులు.

తానీషా—కాను, కాను; నేను మహాపాపిని. వారి దివ్యసుందరాకారములఁ గని, దిగ్భ్రమఁ జెందితిని గాని, వారు సర్వేశ్వరు లను జ్ఞానము నాకు లభింపదయ్యె. చేతులార వారి నర్చింపనైతిని. తనివిదీర సేవింపనైతిని. వారు రామదాసరక్షకులు గాని, రామదాసునౌకరులు గారని గ్రహింపనైతిని. భక్తాగ్రణీ! నా కెవరు దిక్కు?

రామదాసు—అయ్యా! తానీషాగారు! ఇదియంతయుఁ జిత్రముగా నున్నది. మహేంద్రజాలముగా నున్నది. రామా - రామా - రామా:—

ఆ॥ బందిఖానలోనఁ బడియుంటి నిట నేను;
నాకు నెచటఁ గలరు నౌకరు లిలఁ,

జిల్లిగవ్వ లేదు చేత; నార్లక్షలు
పంపు టెట్టులయ్యా? ప్రభువరేణ్యా!

తానీషా—[క్రిందఁబడియున్న చీటిని గని, ఎత్తిచూచి, ఆశ్చర్యముతో]
ఈచీటి ఎక్కడిది? ఇది దెట్లు వచ్చెను?

రామదాసు—తానీషాగారు! జరగినది చెప్పెదను. నాతండ్రి శ్రీరామ చంద్రునకు, నాపైఁ గరుణగలుగదాయెనని, విషపాన మొన రించి, ప్రాణములఁ బరిత్యజింపఁదలఁచినంతలో, ఎటులో మైమఱపు గలిగె. కొంతసేపటికి నోడలెఱిఁగి, విషము త్రావఁబోవఁగా నా పాత్రమందలి విషము గానరాకపోయెను. దానియందు దీచీటి కనఁబడెను. ఇదితప్ప నా కేమియును దెలియదు.

తానీషా—గోపన్నగారు! ఇది నిన్నరాత్రి నే నా సుందరమూర్తుల కొసంగిన రసీదు. ఇది మీకడ కెట్లు వచ్చెనో గ్రహింపఁజాల కున్నాను. ఆ భక్తవత్సలులే, మీకుఁ దెలియకుండ నిచటికి వచ్చి, విషము పాఱఁబోసి, ఈ రసీదు మీకడ వదలిపోయి యుందురు. స్వామీ! నేను మహాపాపిని. నన్ను దరిఁ జేర్ప మీదే భారము.

చ॥ కలుష మొనర్చినాఁడ నినుఁ గష్టము లొందఁగఁజేసి బందెలో
నలయఁగఁ జేసినాఁడఁ గఠినాత్ముని నన్ను క్షమింప వేఁడెదన్
తెలిసెను రామదాస! భవదీయమహత్త్వము;—నీదు భక్తిని
శ్చలతకు వశ్యుఁడౌచుఁ బరిచారకుఁడయ్యెను రామచంద్రుఁడే.

రామదాసు—

శా॥ శ్రీరాముం డిటు నాదుభక్తిని బరీక్షింపఁగనో; లేక త
న్నారాధింప వినిర్మలత్వమును నేకాంతత్వముం గూర్పనో
కారాబద్ధునిఁ జేసెఁగా కరయ నీకర్తృత్వ మేముండె? నీ
నేరం బింతయు లేదు; నే నెవఁడ మన్నింపంగ? శ్రీరాముఁడే.

## అనుబంధము 32.

రామదాసు—తెలిసె, తెలిసె; నా తండ్రిమహిమ దెలిసె. కరుణామయుఁడు, భక్తవత్సలుఁడు, శ్రీరామచంద్రుఁడు ననుఁ గరుణించినాఁడు. నన్ను రక్షించుటకుఁ దా నెంతయుఁ గష్టపడి, సోదరునితోడ భద్రగిరినుండి నీకడకు వచ్చి, ధనము నిచ్చినాఁడు.

తానీషా—అక్కన్నగారు! మాదన్నగారు! మీరు చెంత లేనికతమున నింత మునిఁగినది. నా దౌర్భాగ్యముచే, దుస్తంత్రజ్ఞుల కుటిలవాక్యములు నిజమని నమ్మి, పరమపూజ్యుని పలువిధముల బంధించి, మహాపాపి నైతిని.

రామదాసు—తానీషాగారు! అటు గాదు. మీయాధిక్యమును రామదేవుఁడే స్పష్టపఱచెను. మీకు దర్శనమిచ్చెను. నాకు మఱపు కలిగించెను. ఏల? తెలిసెను, తెలిసెను. మహాపాతకుఁడను. మీయానతి లేక, మీధనమును వ్యయపఱచినది పాతకము. నా కప్పుడీజ్ఞానము లేకపోయినది. ఆ పాపమువలననే, నాకీకారాగృహవాసము గలిగినది. రామునిసందర్శనమునకుఁ గూడ ప్రాప్తి లేకపోయినది. నాప్రభు వగు మీరు రామునికరుణకుఁ బాత్రులరైతిరి. మీ రుత్తమోత్తములు. మీదర్శనము వలననైన నాకుఁ దరణోపాయము గలుగుఁగాక. ఇదిగో మీకు వందనము లాచరించుచున్నాను.

తానీషా—గోపన్నగారు! మీ రట్లనఁదగదు. నిజముగా రాముఁడు నాకు దర్శనమిచ్చుట మీకోఱకే కదా? లేనిచో నన్నాతఁడు కడగంటనైనఁ జూచునా? ఈ యాఱులక్షలలో నరకాసైన, నేనంటువాఁడఁగాను. ఇదిగాక, మీ కెంతధనము కావలసిన నొసంగెదను. దానధర్మములకు, రామకైంకర్యములకు, స్వేచ్ఛగా వ్యయపఱుపుఁడు. తాము మరల భద్రాద్రితహశీల్దారుపదవిని సర్వాధికారములతో స్వీకరింపుఁడు. నాకు రాముని దర్శనభాగ్యముఁ గలిగింపుఁడు. నన్నుత్తరింపఁ జేయుఁడు.

రామదాసు—తానీషాగారు! నన్నింకను నీవైహికతంత్రమున బద్ధునిగాఁ జేయఁజూచెదరా? జీవిత శేషము నేకాంతనిశ్చలభక్తితో, నామహానుభావుని సేవయందుఁ గడపి, తరింపవలయు నను కోరికతప్ప నొండెద్దియు లేదు. నన్ను క్షమింపుఁడు.

తానీషా—అటులే గావింపుఁడు. అమాత్యపుంగవులారా! మనమంద అమును గడువడిని భద్రగిరీశుని పాదసాన్నిధ్యమున కరుగవలెను. మీరును దరలి సకలము నాయత్తము లొనరింపుఁడు.

(నిష్క్రమింతురు)

## ఏడవ అంకము - మొదటి రంగము

భద్రాచలము - తహాశీల్ దార్ రామశాస్త్రిగృహము. రామశాస్త్రి, అతనిభార్య వీరమ్మ.

వీరమ్మ—ఏమండీ! ఇక్కడికి మన కోరికలన్నియుఁ దీరినట్లే. "స్త్రీబుద్ధిః ప్రళయంకరీ" అనుమాట అసూయాపరులు కల్పించినదని, ఇప్పుడైన ఒప్పుకొందురా?

రామశాస్త్రి—ఆలాగే, ఒప్పుకొనవలసియే యున్నది.

వీరమ్మ—మీ రెప్పుడు నాన్నుడుమాటలే. ఇప్పటికిని, మీరు గోపన్న గారికొఱకు విచారించుచున్నట్లే యున్నదే? గుండెదిటవు లేని వారి అవస్థ ఇట్టిదే. సాహసించి చేసిన పనియొక్క ఫలమును సంతోషముతో ననుభవింపలేనివారినే, లోకులు పిఱికివారని యందురు.

రామశాస్త్రి—ఔను, నిజమే. ఏమో తప్పుచేసితినను సందేహము నన్ను వదలకున్నది.

వీరమ్మ—దానికేమిలే! ఊఁ - పిల్లవానికి పదియారేండ్లు వచ్చినవి. ఇఁక నాఁపుటకు వీలులేదు. జందెపుపోఁచ వేసియేతీరవలయు. ఈ శ్రావణమాసములో మంచిముహూర్తము లున్నవఁట. అమ్మాయిపెండ్లి, అబ్బాయివడుగును కలిపిచేసిన ఖర్చు కలిసి వచ్చును. మీకు తహాశీల్ దారుపని నైనతరువాత, మన

యింటిలో గొప్ప శుభకార్యము ఏమియు జరగలేదు. కనుక, ఈ పు శుభములు చాల వైభవముగ జరగవలయు. ఇంతకు మన కేమి నష్ట మున్నది? అంతసామగ్రి తాలూకానుండియే వచ్చుచున్నది గదా! కాదంటే, నాకు ఇపుడు ఐదాఱువేల రూపాయలకు నగలు, చీరలుమాత్రము కొనవలసియుండును. అది ఒక లెక్కలోనిది గాదు.

రామశాస్త్రి—సరేగాని, అమ్మాయికి ఆఱవయేఁడైన నిండలేదే, అప్పుడే ఏమి పెండ్లి? నలుగురు నవ్వుదురు!

వీరమ్మ—నవ్వుట లేదు, గివ్వుటలేదు. మా అన్నయ్యకొడుకునకు ఎనిమిదవయేఁడు. దీనిని వాని కిచ్చితిమేని, పెండ్లికూఁతురు, పెండ్లి కొడుకు చిలుకగోరువంకలలా గుందురు.

[ ప్రవేశము - పురోహితుఁడు ]

పురోహితుఁడు — ఔనండి నిజమైనమాట. ముహూర్తముగూడ చక్కఁగా కుదిరియున్నది. రెండు శుభకార్యములు కలిసియే చేయవచ్చును.

వీరమ్మ—నేనే ముహూర్తము చూచుకొనిరమ్మని చెప్పి పంపితిని.

రామశాస్త్రి—సరే, దాని కేమి, ఆలోచించెదము.

వీరమ్మ—ఆలోచన యేమి? చేసియే తీరవలెను. లేకపోతే నే నొప్పు కొనను.

[ ప్రవేశము - డఫేదారు ఉత్తరములతో ]

రామశాస్త్రి—[జాబులుతీసి చదువుకొని గద్గదస్వరముతోఁ దనలోనే దాను మాటలాడుకొనుచుండును.

వీరమ్మ—ఏమి, ఏమి? కంటఁ దడిపెట్టుకొనుచున్నారేమి? అందఱును క్షేమమేకదా?

రామశాస్త్రి—ఇం కేమిక్షేమము? అయినది, అయిపోయినది.

వీరమ్మ—ఏమయినది?

రామశాస్త్రి—ఏమయినదా? తహశీల్‌దారీ వదలినది. తానీషాగారు ఖైదుశిక్షకూడ వేసినారఁటగాని, మహానుభావులగు రామదాసుగారి యనుగ్రహమువలన ఆ గతి తప్పినది. తత్క్షణము నాయబు తహశీల్‌దారుకు పని ఒప్పగింపుమన్నారు. చూచి నావా స్త్రీబుద్ధిమాహాత్మ్యము? నాగతి ఉభయభ్రష్ట మయినది. ఇంకేమిటి? అధికారము వచ్చిన యానందము ఒక్కనాఁడును నాకు మనస్సులోఁ గలుగలేదు. ఎప్పుడును పరితాపమే. ఇప్పటికిఁ దీఱినది.

వీరమ్మ—చేతఁగానివారలకు నిదే లక్షణము. ఎప్పుడు నొకరిమీఁద నిందమోపడమే. అయ్యో! ఈ శుభకార్యములు జరగినతరువాతనైన వచ్చినది కాదమ్మా ఈ ఉత్తరము! పంద్రెండేండ్లయినది పని యయి; అదిగో, ఇదిగో అనే జరపినారు. ఆ వడుగైనా చేసితిరా? కట్నములద్వారా ఎంతసొమ్ము వచ్చియుండును. పనిపోతే పోయినది. పదివేలరూపాయలైన మూటగట్టుకుంటే బాగుండునుగదా? ఆ తెలివితేటలు ఏమియును లేవు. ఏమి చేయడము?

రామశాస్త్రి నీ కిప్పటికైన బుద్ధి రాలేదు. నీజన్మవేళ విశేషము ఆలాటిది. నీతోపాటు నన్నుఁగూడ పాపాత్ముని జేయుచున్నావు. ఇఁక నేను తెగదెంపులు చేసికోవలెను. నా కీసంసారముతోఁ బనిలేదు. నాకు ముందుగతి చూచుకోవలెను. సాధుశీలుఁడగు మహాభక్తునిపై, లేనిపోనినేరములు చెప్పి ద్రోహ మొనరించితి.

మ॥ సతతంబున్ భవదంఘ్రిపద్మములనే స్వాంతంబునన్ నిల్పు నా
యతిలోకోత్తరు రామదాసునెడ ద్రోహంబూనితిన్ రాఘవా!
గతిహీనంబును నిందనీయమును మోక్షద్వారదూరంబునున్
బతితానేకవృతంబు నయ్యె నిఁక జన్మం బేల ధాత్రీస్థలిన్?

వీరమ్మ—[దిగ్భ్రమఁ జెంది నిలుచుండును.]

(యవనిక పడును.)

## ఏడవ అంకము - రెండవ రంగము.

భద్రాచలము – శ్రీరాముల దేవాలయము. తానీషా, అతని భార్యలు; రామదాసు, అతనిభార్య, కుమారుఁడు; అక్కన్న, మాదన్న, అర్చకులు, బ్రాహ్మణులు మున్నగువారు కూడియుందురు. యవనిక నెత్తఁగానే, అర్చకుఁడు రామలక్ష్మణవిగ్రహములకుఁ బూజ సేయుచుండును. రామదాసు తానీషాకు విగ్రహములను జూపుచుండును.

రామదాసు—

తరల॥ కనులపండువు గాఁగఁ దానిష కాంచుమీ రఘునాథునిన్
వనజనేత్రునిఁ దల్లి జానకి వంద్యు లక్ష్మణదేవునిన్
మనమునం దిటు లేల నీ వనుమాన మొందెద వయ్యయో!
కనుమ యల్లవె, మూఁడుమూర్తులు క్రాలుచున్నవి తానిషా!

తానీషా—

మత్త॥ విగ్రహంబులఁ జూపెదే రఘువీరవర్యుల సంతతా
నుగ్రహంబున నాఁడు దోఁచిననూత్నరూపుల దేవతా
విగ్రహంబుల మించునాకృతి వెల్గుధీరుల వైరులన్
నిగ్రహించుపరాక్రమాఢ్యుల నీరజాక్షులఁ జూపుమా.

రామదాసు— తానీషాగారు! మీరు ధన్యాత్ములు గాన, నాతండ్రిదర్శనము మీకు లభించినది. నే నీజన్మమున నింతవఱకు నిట్టి భాగ్యమునకు నోఁచుకొననైతినిగదా? అట్టినేను, మీ కాదేవదేవుని సోదరసహితుని, మనోహరాకారుని, జానకీసమేతు నెట్లు చూపఁగలను? [రాముని ధ్యానించుచు] హా! జగదీశా! ఆర్తత్రాణపరాయణా! శరణాగతావనశీలా! కరుణాలవాలా! ఇఁకనైన నీదివ్యసుందరవదనారవిందసందర్శనము నా కొసంగి రక్షింపవా?

ఉ॥ కోరఁగలేదు సంపద లకుంఠితభాగ్యసమృద్ధి; భక్తి చే
కూరిన నాకుఁ జాలు నదె కొండలు సేయును; మ్రొక్కి వేఁడెదన్
కోరినకోర్కి యొక్కటియె, కోమలితో ననుజన్ముతోడ గం
భీరకృపాంచితాకృతి నభీష్టముఁ దీరఁగఁ జూపి ప్రోవవే.

మహానుభావా! తొల్లి యెట్టి సుందర సుకుమార కుమార మూర్తులతో, నీవును సోదరుఁడును, ఈమహీనాథునకు దర్శన మొసంగితిరో, అట్టి దివ్యసుందరమూర్తులనే ధరించి, నేఁడు దర్శన మొసంగి, మముఁ దరిఁ జేర్పకున్న నిను వీడువాఁడఁ గాను. రక్షింపుము, రక్షింపుము. [తత్క్షణమే విగ్రహములు సీతారామలక్ష్మణులుంగ మాఱును.]

రామదాసు—
తానీషా— } ఆహా! ఆహా! ధన్యోఽస్మి, ధన్యోఽస్మి. నేఁడు మాజన్మము సార్థక మైనది.

రామదాసు—(దండకము.) శ్రీరామరామా! పరంధామ! సీతామనః కామ! మార్తాండవంశాబ్ధిసోమా! మునీంద్రాదిభక్తాళి సంస్తోత్రకృన్నామ! క్రూరాసురాళీవిరామా! జగన్నాటకం బెల్ల నాడించుచున్ లీలమై మానుషాకారముం బూని లోకోపకారార్థమై నీదుచారిత్ర మాదర్శ మౌనట్లుగాఁ జేసితో రా! జగత్కీర్తనీయంబు నీశక్తి; సీతాసుమిత్రాత్మజుల్ సర్వకాలంబు చేదోడువాదోడుగానుండ మాభద్రశైలంబునందున్ వసింపంగదే? సర్వభక్తాళికిన్ దర్శనం బిచ్చుచున్ సేవలం గొంచుఁ బ్రేమంబుమీఱంగ శిష్టాళిరక్షించి దుష్టాళిశిక్షించి లోకంబుపాలించుచున్; హేదయాసాంద్ర! శ్రీరామచంద్రా! నమస్తే! నమస్తే!! నమః!!!

తానీషా—రామదాసుగారు! మీ కటాక్షమున స్వామిసందర్శనము లభించినది. స్వామి నాయపరాధములు క్షమించి, నాకు దర్శన మొసంగి, ననుఁ గృతార్థుని గావించెను. మీ కృపకుఁ బాత్రుఁడఁ గాకున్న, నా కీధన్యత లభింపదు. మీరు మ ముద్ధరింపఁ జేసితిరి. ప్రారబ్ధకర్మవశంబున నా కీజన్మము సంప్రాప్త మయ్యెను. రాజస తామస గుణప్రధాన మగు, జన్మసంపర్కమువలనఁ బరమపూజ్యులయెడ, నేను మహాపచారముల నొనరించి, ఘోరపాతకుఁడ నైతిని. పాతకులు, శిక్షాపాత్రులు

గాన, నేను శిక్షార్హుండనె కాని, సాధుసందర్శనసంజనితపుణ్య విశేషము నా పాపపటలమును, పటాపంచ లొనరించుటయే కాక, నాకు జగన్నాథుల సందర్శనభాగ్యమునుగూడఁ గలిగించినదిగాని, అపు డజ్ఞానాతిశయమున, సర్వేశ్వరులని నేను గ్రహింపఁజాలక పోయినను, ఆమహాసందర్శనభాగ్యముననే నాకు జ్ఞానోదయమైనది. శ్రీరామచంద్రుని మనోనాయిక యగు సీతాదేవిని, భక్తాగ్రణి యగు లక్ష్మణదేవుని, నీ చర్మచక్షువులతో దర్శించుభాగ్యము నాకు లభించినది. ఇట్టి మహాభాగ్యము వడసినందులకును, మీపేరు కలకాలము లోకమునందుఁ గొనియాడఁబడుచుండుటకును, ఈ భద్రాచలము తాలూకాను ఈ దేవాలయమునకు శాశ్వతముగా జాగీరుగా సమర్పించితిని. ఆచంద్రతారార్కముగ నిక్లే స్వామి కత్యంత వైభవముతో, నిత్యమంగళముగా, మహోత్సవసముపేతములగు కైంకర్యములు జరగునట్లు నా తండ్రి కటాక్షించుఁగాక!

మంగళము.

మంగళకర శుభమంగళవిగ్రహా
మంగళసంయుత మంగళదా
మంగళ మహా జయ, మంగళ మహా శుభ
మంగళ మహా రఘుపుంగవశ్రీ.

సమాప్తము.

# అనుబంధములు.

1. భజన—పాట. యదుకులకాంభోజి—మిశ్రలఘు.

శ్రీరామనామం మరువాం మరువాం
సిద్ధము యమునికి వెరువాం వెరువాం.

1. గోవిందు నేవేళఁ గొలుతాం గొలుతాం
దేవుని గుణములు తలుతాం తలుతాం॥

2. విష్ణుకథలు చెవుల విందాం విందాం
వేఱుకథలు చెవుల మందాం మందాం॥

3. రామదాసులు మాకు సారాం సారాం
కామదాసులు మాకు దూరాం దూరాం॥

4. నారాయణుని మేము నమ్మేం నమ్మేం
నరుల నింక మేము నమ్మాం నమ్మాం॥

5. మాధవనామము మరువాం మరువాం
మఱి యమబాధకు వెరువాం వెరువాం॥

6. అవనిజాపతిసేవ మానాం మానాం
మఱియొక జోలంటె మానాం మానాం॥

7. భద్రగిరీశుని కందాం కందాం
భద్రముతో మన ముందాం ముందాం॥ శ్రీ॥

2. కబీరుదాసు—పాట. హిందుస్థాని—దర్బారికానడ—ఆది.

భజొరెభయ్యా రామగోవిందహరి॥ భజొరెభయ్యా॥

1. జపతపసాధన కచునహిలాగత ఖరచతనహిగఠరీ॥ భజొ॥

2. సంతతసంపద సుఖకేకారణ జ్యాసేభూలపరీరే [భజొ॥
కహాతకబీరా జ్యాముఖరామనహీం – వో ముఖధూలపరీ॥

3. గోపన్న—పాట. ముఖారి—ఆగి.

తారకమంత్రము కోరిన దొరకెను
ధన్యుఁడ నైతిని ఓరన్నా!
మీఱినకాలుని దూతలపాలిటి
మృత్యువ యని నమ్మర యన్నా॥ తా॥

1. ఎన్ని జన్మముల నెంచిచూచినను
ఏకో నారాయణుఁ డన్నా!
అన్నిరూపులై యున్న పరాత్ముని
నామమహాత్మ్యకథలను విన్న॥ తా॥

2. ఎన్ని జన్మములఁ జేసినపాపము
లీజన్మముతో విడు నన్నా!
అన్నిటి కిది కడసారిజన్మ మిది
సత్యంబిఁకఁ బుట్టుట సున్న॥ తా॥

4. కబీరు—పాట హిందుస్థాని—పీలు.

గురు - కృపా - అంజన పాయోమేరె భాయి
రామబినా - కఛు - ఆననపాయి
అందర - రామా బాహెరరామా
జహాఁ - దేఖే - వహాఁ రామహి - రామా॥ గురు॥

1. జాగ్రత - రామా సోయత - రామా
సపనమె - దేఖత సీతారామ॥ గురు॥

2. ఏకాజనార్దని - భావహినికా
జహాం దేఖే వహాం - రామసు రేఖా॥ గురు॥

5. కబీరుదాసు—పాట. హిందుస్థాని—కానడ—రూపకము.

మైం గులామ మైం గులామ - మైం గులామ తేరా
తూంచి మేరా సచ్చా సాంఈ - నామ లేఊం తేరా॥ మైం॥

1. రూప నహీం రంగ నహీం - నహీం బరన ఛాయా
నిరాకార నిరగున నహీం - తూంచి రఘురాయా॥ మైం॥

2. ఏక రోటీ దే లంగోటీ - ద్వార తేరా పాఊం
కామ క్రోధ ఛోడకర - హారిగున గాఊం॥ మైం॥

3. మెహెరబాన మెహెరబాన - మెహెర కరో మేరీ
దాస కబీర చరన ఖడా - నజర దేఖ తేరీ॥ మైం॥

6. కబీరుదాసు—పాట. హిందుస్థాని—నాథనామక్రియ—ఆది.

త్యాగ కరో మాయా - తజో సన్సార్
తజో సన్సార్ - భజో కర్తార్॥ త్యా॥

1. సంగ్ నఆయే - సాథ్ న జాయే
ఝూట్ హై సౌదా యే - ఝూటా బాజార్॥ త్యా॥

2. అన్తకో ఫ్రాటే - దేహ్ యె ఛూటే
కాన్చ్ కికాయా సే - రహనా హెూషియార్॥ త్యా॥

7. గోపన్న—పాట. హిందుస్థాని—సారంగ—చాపు.

వందే రఘురామ - శుభనామ
శుభనామ తులసీదళదామాభిరామ॥ శ్రీరామ॥

1. కనకమణిమయహారా - సుకుమార
సుకుమార పక్షిరథసహితకుమార
సువిహార - అరిశూర - భూధరధీర - కల్మషదూర
పాలితవారణ - దారుణకారణ - మదహరణ
రఘువీర - రఘువీర నీరదాభవిమలశరీర - నిర్వికార॥ వందే॥

2. కుంతల జితనీల - భక్తపాల - భక్తపాల
సురద్వేషి పటల విఫాల - వరశీల
కనకచేల - కాంతిజాల - మానుషలీల
దానవబాలక - తావకసేవక
సురపాల - భూపాల - కౌస్తుభవన
మాలవిశాల - సుకపోల॥ వందే॥

8. కబీరుదాసు—పాట. కల్యాణి—ఆది.

రామభజనకూం దియా కమలముఖ - రామభజనకూం దియా
లఖచౌర్యాంశీ ఫేరే ఫిరకర - సుందర నరతను పాయా॥ రామ॥
1. ఖాయా పియా సుఖసే సోయా - నాహక జమానా ఖోయా॥ [రామ॥
2. జోముఖ నిశిదినీం రామనామ నహీ - వహోం తుమ కభు నాహీ [కియా॥ రామ॥
3. కహత కబీరా సున భాఈ సాధు - ఆయా వైసా హీ గయా॥ [రామ॥

9. బ్రాహ్మణులు—పనస.

నవోనవో భవతి జాయమానోహ్నాం కేతురుషసా
మేత్యగ్రే భాగం దేవేభ్యో విదధా త్యాయన్
ప్రచన్ద్రమా స్తరతి దీర్ఘ మాయుః
శతమానం భవతి శతాయుః పురుష శ్శతేన్ద్రియ
ఆయుష్యే వేన్ద్రియే ప్రతితిష్ఠతి॥ హరిః ఓమ్॥

10. రామమూర్తి—గేయము (మురారిదానవ మెట్టు.)

సురామరాఘవ - విదేహజాహృది - నివాసులోలుప - శోభనా
సురేన్ద్రవన్దిత - సరోజలోచన - విరోధిభీకర - శ్రీకరా॥
మునీన్ద్రమానస - వినోదనా ఘన - మనోజ్ఞ సద్గుణ - భూషణా
అనాదిసంచిత - ఘనాఘనాశన - సనాతనాశ్రిత - పావనా
అమానుషాద్భుత - సుమాన్యవైభవ - నమజ్జనాభయ - దాయకా
అమోఘవిక్రమ - రమామనోహర - నమోస్తుతే రఘు-నాయకా॥

11. రహీం—పాట. ధన్యాసి—ఆది.

సలామ లేఖుం సలామ లేఖుం సర్దార్ మైబాబు। [సలాం॥
విలసితముగ నీ విప్పుడు పాచ్ఛాకొలువున నేమో తంటచేస్తివట॥
సర్కార్ పైకము తెమ్మని మిమ్ము, చాలాదర్పమున। [సలాం॥
హర్కారులతో వెంటఁబెట్టుకొని అరుగఁదలఁచినామయ్యా మీకీ॥

12 ఉస్మాన్—పాట కల్యాణి—ఆది.

ఆవ్ మియా - హమారపాచ్చా కేపాస్ - చల్ మియాం - గోలకొం
[డకు చల్ మియా
అరేలేవ్ మియా - అంటె ఏమో - యోశించేవ్ మియా - అరే
[వురో వురో చల్ చల్ ॥ ఆవ్ ॥

1. దివాసిదిండు తక్యానేడు - దిగూ సబాబుహుకు మిదిచూడు
జవాబు మాతో సరిగానేఁడు - చెప్పి నీమానము కాపాడు ॥ ఆవ్ ॥
2. ఔరంగబాదు తఖత్తులోన - అనేక తహశీల్ దార్లున్నారు
వారిపై బాకీలు సున్నా - యేమో నీపై బాకీ శానా। ఆవ్ ॥

13 రహీం—పాట కల్యాణి—ఆది.

1. నిమిషమైన నిలుననీయము - నిలువలన్ని ఝూడాపైకము [ఆవ్ ॥
చేకొనుము వేగమె యిపుడు - జేర్బందు చేకొందుము చూడు ॥
2. అరలే కానీ నీవేయిా సీమా - కధికారైనను వెఱువాము మీా
దొర భద్రాచల శ్రీరామ - దాసుఁడవని తాళితి సుమ్మా॥ ఆవ్ ॥

పాట సౌరాష్ట్రము—ఆది

14 రామదాసు.

వినుఁడీ తానీషగారు - ఏల నాపై నుద్దండకోపము చేసేరు
కండక్రొవ్వుచేత నేను - దుండగికముసేయను - భూ-మండ
లములోను మీాకీర్తి - నిండా గల్గఁజేసినాను॥ విను॥

15. తానీషా

తా సంపాదించి చేసిన ధర్మముచేఁ గల్గు కీర్తి - యే శాస్త్రజ్ఞుఁడు
ఇప్పుడు - నీకీమతి గల్పించినాఁడు ॥ తెమ్ము గోపన్న నీవు - మా
ముజరాపైక మిప్పింపు వేగమె నీవు॥

16. రామదాసు.

ఘనమైన మీా నగరుకొరకు - దినము ఖర్చు కనదు స్వల్ప - ధన
మిదో మీా భద్రాచలపురములో గుడిఁ గట్టినాను॥ విను॥

17. తాళీషా.

బలవంతుల ధనము వారి - సెలవు లేక ఖర్చు సేయ తల పోవు
నని మదిలోఁ - దలపోయవైతి విదేమి॥ తెమ్ము॥

18. రామదాసు.

స్థిరమాని దేహ మిప్పట్లో - నెఱనమ్మలేదు మీాయట్ల - దొర
భద్రాచల శ్రీరామ - దాసుఁడనై చేసితి సుండీ॥ విను॥

19. రామదాసు—పాట ఖాండు—ఆది.

ఏతీరుగ నను దయఁజూచెదవో - యినవంశోత్తమ రామా
నాతరమా భవసాగర మీాఁదను - నళినదళేక్షణ రామా॥ ఏ॥

1. శ్రీరఘునందన సీతారమణా - శ్రితజనపోషక రామా
కారుణ్యాలయ భక్తవరద ననుఁ - గన్నది కానుపు రామా॥ ఏ॥

20. రామదాసు—పాట. నాటకురంజి—చాపు.

ఏడ నున్నాఁడో - భద్రాద్రివాసుఁ - డేడ నున్నాఁడో
నాపాలి రాముఁ - డేడ నున్నాఁడో॥

1. ఏడ నున్నాఁడో - జాడ దెలియరాదు
నాఁడూ గజేంద్రుని - కీడుఁ బాపినస్వామి॥ ఏడ॥

2. ద్రౌణిబాణజ్వాల - దాఁకిన బాలునికిఁ
బ్రాణ మిచ్చిన జగ - త్త్రాణరక్షకుఁడు॥ ఏడ॥

3. పాంచాలి సభలోన - భంగమొందిననాఁడు
వంచన లేకమె - వలువ లిచ్చిన తండ్రి॥ ఏడ॥

4. అక్షయముగ శ్రీభ - ద్రాచలమందున
సాక్షాత్క-రించిన - జగదేకవీరుఁడు॥ ఏడ॥

21. రామదాసు—పాట. మాల్గోస్—చాపు.

దయాశీల - శ్రీరామ - దాసావనా
అయో! దేవ - నీ మోముఁ జూపింపవా॥ దయా॥
కటా! బాధ - కీదేహ - మోర్వంగ లే
దె టీవృశ్చికత్రాస - మే నైతు హా॥ దయా॥

22. రామదాసు—పాట. కాపి—రూపకము.

అబ్బబ్బా దెబ్బలకు నోర్వలేరా
జబ్బుసేయక రారా తబ్బిబ్బాయెరా॥ అబ్బబ్బా॥

1. అట్టె నినుఁ బూజించినట్టి చేతుల నిదిగో
గిట్టి కట్టికొట్టె రెట్టు తాళుదునయ్యా॥ అబ్బబ్బా॥

23 రామదాసు—పాట. కల్యాణి—ఖుశ్రలఘు.

నను బ్రోవుమని చెప్పవే – సీతమ్మ – నను బ్రోవుమని చెప్పవే
నను బ్రోవు మని చెప్పు – నారీశిరోమణి –
జనకునికూఁతుర – జనని జానకమ్మ॥ నను॥

1. అక్కఱతో నీవు – వక్కలాకుల నీయఁ –
జొక్కియుండెడి వేళ – దిక్కుచూపి కావ॥ నను॥

2. పొందికతో పూల – కందుక మాడు వేళ –
డెంద మానందమొంద – ముందు వచ్చి వేగ॥ నను॥

3. అద్రిజావినుతుఁడు – భద్రగిరీశుఁడు –
నిద్రమేల్కొను వేళ – నెలఁతరో బోధించి॥ నను॥

24. రామదాసు—పాట. నాదనామక్రియ—అట.

సీత నీవు చెప్పరాదుగా – శ్రీరాములతోను
సీత నీవు చెప్పిన నీ – తాత సొమ్మేమి పోయెనా
పాతకములెల్లఁ బాపి – దాతవై రక్షింపుమనుచు॥

1. పాలకడలికూఁతు రందురే – శ్రీహరియురమున లీలగా వెలసినా
పాలవంటి గుణము నీకు – చాలఁ గలిగియున్న వన [వందురె
మాలికాధరుని చెవుల – మేలుగా నామాట యింత॥ సీత॥

2. నన్నుఁ గన్నతల్లిగాదుగా – సుతుఁడు నిన్నెంతో సన్నుతింప విన [లేదుగా
వెన్నెలతేని సోదరి నా – విన్నపము విని నీదు
వెన్నుఁడైన శ్రీరాములతో – నన్నుఁ గరుణింపుమనుచు॥ సీత॥

రామదాసు నేలుమంటివే - భక్తులకెల్లఁ - గామితార్థ మియ్యుమం
కోమలాంగి నీపాదముల - సేమముతో నమ్మియున్న [టివే
ప్రేమతో న న్నేలుమని - స్వామి భద్రాద్రీశునితో ॥ సీత ॥

25. సీతాదేవి—పాట. దేశీయతోడి—రూపకము.

నామనవి విని వేగ ప్రాణనాథ - మన
రామదాసును వదలింపుము ప్రాణనాథ॥

పాచ్ఛాయనే మ్లేచ్ఛుఁడు ప్రాణనాథ - తుచ్ఛ
తుచ్ఛవాక్యము లాడెనయ్య ప్రాణనాథ॥

లక్షపైకముఁ దెమ్మనుచుఁ బ్రాణనాథ - ఎంతో
శిక్షఁ జేయుచున్నారయ్య ప్రాణనాథ॥

శరణన్న రక్షింతుననుచు ప్రాణనాథ - నీవు
శరణాగతబిరుదు వహింపు ప్రాణనాథ॥

తురకపైకము చెల్లించను ప్రాణనాథ - ఎంతో
త్వరితముగ వేంచేయుఁడీ ప్రాణనాథ॥ నామనవి॥

26. సీతాదేవి—పాట. కురంజి—ఆది.

ఎడదన్ మిము - నెడఁబాయక - నిడియుండెడి దాసున్
తడసేయక - కడువేగమె - విడిపింపుఁడు నాథా॥

చరణంబులె - శరణంబని - నెఱనమ్మినవారిన్
కరుణాకర - తరుణంబున - భరియింపుఁడు వేగన్॥

27. రామలక్ష్మణులు—పాట. ఢిండి—ఆది.

మేలుకొనూ - తానీషా - వేగ నీవు
ఇక తాళ - వేళలే - దయ్యా మాకు ॥ మే ॥

రామదాసు - బాకీనీ - తీర్చెదము
వేగ రసీ - దీయవే - దీనిగొని ॥ మే ॥

28. తానీషా, రామలక్ష్మణులు—పాట. హిందుస్థాని—జిల్లా—ఆట.

1. తా. ఏదేశమున నుండువారు - మీరు
ఎందుండి యిట వచ్చినారు?
రా. తొొలుత గోదావరియందు - మా
స్థలము భద్రాచలమందు.

2. తా. ఎవరి జవానులు మీరు - మి
మ్మెవరు పంపఁగ వచ్చినారు?
రా. దాసజవానులు మేము - రామ
దాసు పంపఁగ వచ్చినాము.

3. తా. ఏమికులమువారు మీరు - మీ
రిద్దఱు నేవరుసవారు?
రా. ఇనవంశమునఁ బుట్టినాము - మే
మిద్దఱ మన్నదమ్ములము.

4. తా. ఏమినామము గలవారు - మీ
రేమినీమము గలవారు?
రా. రామోజి లక్ష్మోజి నామం - వహ్వా
రామానుజమతమువారం.

5. తా. ఎందుకు పంపించినారు - మీ
రేమి పనిగ వచ్చినారు?
రా. సర్కార్కాబాకీ పయికము - మా
చేతఁ బంపఁగ వచ్చినాము.

6. తా. అర్థ మంతయుఁ దెచ్చినార - లేక
వ్యర్థముగా వచ్చినార?
రా. ఆఱులక్షల నందుకోండి - మాకు
రసీదు నిపుడె యియ్యండీ.

7. తా. కలంశాయి లేదు యిక్డ - కల్
ఫజర్ మే రండి పోపొండి.

29. రామదాసు—పాట. బిలహరి—చాపు.

ఇక్ష్వాకుకులతిలక! యికనైనఁ బలుకవె రామచంద్రా! నన్ను
రక్షింపు మింక నోరఘుకులతిలక! శ్రీ రామచంద్రా!॥

1. చుట్టుప్రాకారములు సొంపుతోఁ గట్టితి రామచంద్రా! ఆ
ప్రాకారమునకుఁబట్టెఁ బదివేల వరహాలు రామచంద్రా! ॥

2. సీతకుఁ జేసితి చింతాకుపతకము రామచంద్రా! ఆ
పతకమునకుఁ బట్టెఁ బదివేల వరహాలు రామచంద్రా! ॥

3. సర్కారుపైకము తృణముగ నెంచుమీా రామచంద్రా! ఈ
దెప్పరమును గాచి యప్పుఁ దీర్పవయ్య రామచంద్రా!॥

30. రామదాసు—పాట. యదుకులకాంభోజి.

పాహి మాం శ్రీరామా యంటే పలుకవైతివీ – నీ
స్నేహమెట్టి దని చెప్ప – నోహొూ హొూ హొూ–
హొూ హొూ హొూ హొూ ॥ పాహి॥

1. ఇబ్బంది నొంది యాకరి – బొబ్బపెట్టినంతలోనే
గొబ్బునఁ గాచితివానీ – జబ్బుసేయక –
నిబ్బరముగా నే నెంతో – కబ్బ మిచ్చి వేఁడుకొన్న
తబ్బిబ్బు చేసెదవు రామ – అబ్బ బ్బ బ్బ బ్బ బ్బ బ్బ బ్బ॥ పాహి॥

2. సన్నుతించు వారినెల్ల – మున్ను – దయతోఁ బ్రోచితివని
పన్నగశాయి! నే విని విన్నవించితి –
విన్నపము వినక యెంతో – కన్నడచేసెదవు రామ!
యెన్నఁటికి నమ్మరాదు – రన్న న్న న్న న్న న్న న్న న్న॥ పాహి॥

3. చయ్యన భద్రాచలనిలయ – స్వామివని నమ్మి నేను
వెయ్యాఱువిధముల నుతి – చెయ్యసాగితి –
ఇయ్యెడను రామదాసుని – కుయ్యాలించి ప్రోవకున్న – నీ
యొయ్యారమేమనవచ్చు – నయ్య య్య య్య య్య య్య
[య్యయ్యొ॥ పాహి॥

౩1. రామదాసు—పాట. జంఝూటి—ఆది.

అంబుజసంభవుఁడే - కాంచలేని యా
అంబుజనాభునిఁ - గాంచితివా - రాజా॥ అంబు॥

అంబుజాలయా - ధవుఁడగు నా హరి
అంబుజాక్షుఁడని - యాత్మ నెఱింగితో॥ అంబు॥

32. తానీషా, రామదాసు—సంవాదము. యదుకులకాంభోజి—ఆది.

తా. గోపన్నా నే - పాపిని పాపిని - కోపంబున నిన్ను
ఆపద నొందఁగఁ - జేసినద్రోహిని - గాపాడవె నన్ను॥

రా. తానిషా మీ - త ప్పేమున్నది - దండన కర్తుఁడను
శ్రీనాథుఁడె తా - శిక్షించెను నను - చిత్తశాంతికొఱకు॥

తా. మానితశీల సాత్త్వికాగ్రణీ - మన్నింతువె నన్ను
ఆహా! తెలియక - అజ్ఞానంబున - నలయించితి నిన్ను॥

రా. రాముఁడె దైవము - రక్షకుఁ డాతఁడె - రాముఁడె మన్నించు
పామరుఁడను నే - ప్రభుఁడవు నీవు - పాడియె యి ట్లాడ॥

తా. రామభక్తుఁడవు - రాముఁడు మెచ్చెను - రామదాసుఁడవుగా
కామక్రోధముల - కలుషుఁడ నేఁ గద - గతి కలదే నాకు॥

రా. తండ్రి కృపాళుఁడు - దర్శనమిచ్చెను - ధన్యుఁడ వైతివిగా
తండ్రినిగొలువుము - దశరథరాముని - దయఁ గను నా ప్రభుఁడు॥



PRINTED AT THE DIOCESAN PRESS, MADRAS—A 1931.

[అంత రత్నాకరమహారాజు ససైన్యంబుగఁ బ్రవేశించుచున్నాఁడు]

[అంత సుధాకరుఁడు ప్రవేశించి]

**సుధా**—తండ్రీ! నేనపరాధినైతిని. నన్ననుగ్రహింపుఁడు. (అని తండ్రి పాదములపై వ్రాలుచున్నాఁడు.)

రత్నా—సుధాకరా! కలుషాత్మా! వృద్ధులైన జననీజనకులను దుఃఖపెట్టి శత్రువుల నాశ్రయించిన కులదూషకుండవగు నీ మొగముఁ జూడరాదు. తొలఁగియుండుము.

(అని త్రోసివేయుచున్నాఁడు)

(అంత గగనంబునుండి యొకధ్వని.)

గగనవాణి—రాజా! పుత్రునిపైఁ గినియకుము. భగవద్భక్తుండును పరమపావన చారిత్రుండునగు సుధాకరునిజాయగా నీరోహిణీ కన్య సృజింపఁబడినది. దైవప్రేరితంబగు నిమ్మిథునానుబంధంబు ననుగుణించి నీవు చింతింపవలదు. భగవదనుగ్రహసంపన్నులగు నీవధూవరులు చిరతరానూనపరస్పరానురాగవైభవ సమృద్ధులై వర్ధిల్లగలరు. కావున నీవెంతమాత్రమును శంకింపకుము.

రత్నా—ఓహో! ఓహో! ఆశ్చర్యము! ఆశ్చర్యము! నేనింక ధన్యుఁడ నయ్యెద. (అని పుత్రుని లేవనెత్తి) కుమారా! పరాత్పరుండగు శ్రీమన్నారాయణమూర్తి యఖండకారుణ్యపాత్రుండవగు నీమహిమను గుర్తెఱుఁగఁజాలనైతినిరా తండ్రీ.

శా. రారా! రాజకులైకభూష! తనయా రారా! లతాంతాయుధా
రారా! సారవిచారధీలసిత! రారా! చిన్నప్రోడా! కుమా
రా! రాజీవదళాక్ష! ముద్దిడగరా రారా! కౌఁగిటన్ జేరరా
రా! రామామణిఁ బెండ్లియాడి సుఖివై రాజిల్లరా! పుత్రకా.

(అని పుత్రుని గాఢాలింగనంబొనర్చుచున్నాఁడు.)

[అంత విశారదుఁడు ప్రవేశించి]

విశా—దేవా, నేనపరాధినైతిని. నన్ననుగ్రహింపుఁడు! (అని పాదములపై వ్రాలుచున్నాఁడు.)

రత్నా—విశారదా! క్షమించితి. లెమ్ము.

[అంత దక్షమహారాజు మారుతియుఁ బ్రవేశించుచున్నారు.]

దక్షు—(రత్నాకరుని సమీపించి) మహారాజా! మనముభయులము పూర్వవైరంబులం దిగనాడి యన్యోన్యసంబంధబాంధవ్యంబులచేఁ బరస్పరమైత్రి నుండవలయునని నాకోరిక. అట్టినాయభీష్టంబొనగూర్ప నాముద్దుకూఁతుఁ దమకోడలుగాఁ గైకొనుఁడు.

రత్నా—మిత్రమా! దక్షమహీధవా! ఇంతకన్న మేలెయ్యది? నీవంటివానితో వియ్యమందుటకన్న నాకు వేఱొండు భాగ్యమబ్బునే?

(అని కరలగ్నమంబుల నన్యోన్యమైత్రిఁ బ్రకటింపుచున్నారు.)

దక్షు—(రత్నాకరునితో) మహారాజా! వివాహమంటపమును బ్రవేశింతము రండు.

రత్నా—మంచిది. (అని యిరువురును వివాహమంటపమును బ్రవేశింపుచున్నారు.)

---

రంగము:—వివాహమంటపము.

[మాంగళ్యతూర్య నినాదంబులు బ్రాహ్మణాశీర్వాదంబులును జెలంగ రోహిణి సుధాకరుని మెడను పుష్పహారమును గీలింపుచున్నది.]

దక్షు—(సుధాకరునిడగ్గఱి) రాజకుమారా! మున్ను నీమహిమను గుర్తెఱుంగఁ జాలక నీయెడల నేనొనర్చిన మహాపరాధంబులనెల్ల సైరించి నాపుత్రికారత్నంబును బరిగ్రహించితివి. ధన్యుండనైతి.

మఱియు,

శా. నారీరత్నము నీకొసంగితిని భూనాథాత్మజా! నీవు మం
దారోర్వీజమవౌట నిందుముఖి పాంతత్ మల్లతీవౌటఁ ద
ద్భారంబీవు సహించియిచ్చుచును శశ్వత్కామితార్థంబులన్
నీరక్షీరములట్లు మీరు మనుఁడీ నిత్యానురాగంబునన్.

(అని రత్నాకరునితో) మహారాజా!

ఉ. పొంకము మీఱఁ బూర్వభవపుణ్యవశంబున మిమ్ముఁ బోలు వి
య్యంకుని గంటిఁ గావునఁ గృతార్థుఁడనైతి వధూవరుల్సదా
యంకిలిలేని మైత్రి వెలయన్ భువి వర్ధిల దీవనంబు నే
నుంకువగా నొసంగెద సహో! నృప నీరి సమాదరింపుమా.

(అంత రోహిణి మామకుఁ బ్రణమిల్లుచున్నది.)

రత్నా—ఓస్నుషారత్నమా! ఈసుధాకరుండను నా సత్కుల దీపము నీగుణశీలస్నేహప్రేరితంబై బహువిధంబులుగఁ బ్రజ్వరిల్లెడు.

సుధా—(పుత్రిక నతిప్రేమచే దగ్గఱఁ జేర్చి) పుత్రికారత్నమా!

చ. కలికిరొ నీవు నీపతియు గాఢపరస్పర రాగపూర్ణులై
యల[illegible]దు భూరిరాజ్యవిభవాన్వితులై తనరారి పుత్రులన్
బలువుర గాంచి కీర్తిగని పాయక భక్తిని నత్తమామలన్
బలుమరు సేవలందనిపి భాసిలుచు న్నము వీడఁబోకుమీ.

రత్నా—దక్షమహీధవా! నేటికి భగవత్కటాక్షంబున మనకోరికలన్నియు నెఱవేరినవి. ఇంకనేమి కావలయును.

దక్షు— మాలిని.

నీతిగనీధరణీ పతుఁబందఱు నెమ్మిని రాజ్యము లేలవలెన్
ఖ్యాతిగ మేఘుఁడ ఖండసువృష్టిని గల్గఁజేయు ఫలోన్నతమా

భూతలమందున నీ మానవు లప్రీతి నీ మానసుఖంబుల వర్ధిలు
ప్రీతిగ నాథ నీ వంతుని నిశ్చలభక్తి నుతింపుచు నుండవలె

గగనవాణి—తథాస్తు తథాస్తు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

గద్య.

ఇది శ్రీమద్వేంకటరమణకరుణాకటాక్ష వీక్షణాసారసమాసాది
రసబంధుర కవిత్వవైఖరీప్రవీణాపస్తంబసూత్ర శాండిల్యస
పవిత్రహారీతకులకలశార్ణవరాకాకైరవమిత్ర వేంకటరత్న
సుపుత్ర వెంకమాంబాగర్భశుక్తిముక్తాఫల వివిధ
విద్వజ్జనవిధేయ వేంకటకృష్ణనామధేయ ప్రణీతం
బైన రోహిణీ సుధాకరవిజయంబను నాట
కంబున సర్వమును షష్ఠాంకము
సంపూర్ణము.

